


I want to subscribe / gift to the following editions of Chandamama

(Tick whichever is applicable):

English ☐ Language ....................☐ Junior Chandamama ☐

Name: ....................................................................................

Date of Birth: .................................. Sex :....................................

Address: ................................................................................

.............................................................................................

.............................................................................................

.................................................... City: ........................................

State:........................................ Pin:............................................

Telephone:...............................................................................

Mobile:....................................................................................

Email:......................................................................................

Gift Subscription to the following address:

.............................................................................................

.............................................................................................

.............................................................................................

.............................................................................................

Enclosed Cheque/DD* for Rupees...............................................

Cheque/DD No ........................................................................

favouring Chandamama India Ltd on........................................

.............................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet,
Chennai-600 018 Tel: (044) 24334455, Fax: 24322103,
Email: subscription@chandamama.com
You can also subscribe online at:
www.chandamama.comt


చందమామ సంపుటి: 61 అక్టోబర్ 2008 సంచిక:10

## ఈ నెల విశేషాలు













## ఈ సంచికలో...





## అమరవాణి

ఐశ్వర్యవంతుడిలో
సౌజన్యమూ,
శూరుడిలో
మితభాషిత్వమూ,
జ్ఞానిలో శాంతమూ,
ధనికుడిలో
పాత్రదానమూ,
తపస్విలో కోపం
లేకపోవటమూ,
విజ్ఞానిలో
వినయమూ,
ధర్మాత్ముడిలో వంకలు
వెతకకపోవటమూ,
అన్నింటిలోనూ
శీలమూ గొప్ప
అలంకారాలు!

# క్రీడారంగంలో భారతదేశ స్థానం?

ఆగస్టులో బీజింగ్‌లో జరిగిన 29వ ఒలింపిక్ క్రీడలలో 205 దేశాలు పాల్గొన్నాయి. ఇంత కాలం అంతర్జాతీయ క్రీడారంగంలో ముందు వరుసలో ఉన్న అమెరికా, జర్మనీ, రష్యా, గ్రేట్‌బ్రిటన్ వంటి దేశాలను అధిగమించి చైనా మొత్తం 302 పతకాలలో 51 బంగారు పతకాలను కైవసం చేసుకుని పతకాలు సాధించిన 87 దేశాలలో ప్రథమ స్థానాన్ని అలంకరించింది!

మన దేశం 55 మంది క్రీడాకారులను పంపింది. చరిత్రలోనే ప్రప్రథమంగా వ్యక్తిగత విభాగంలో ఒక బంగారు పతకాన్ని, రెండు కాంస్య పతకాలను మన క్రీడాకారులు గెలుపొందారు. బీజింగ్ పతకాల జాబితాలో ఈ మూడు పతకాలు మనకు 50వ స్థానాన్ని తెచ్చి పెట్టాయి. ఇది నిజంగానే ప్రతి భారతీయుడూ సంతోషించ తగ్గ విషయమే. అయితే, ఈ సందర్భంగా క్రీడా ప్రపంచంలో మనదేశ స్థానం గురించి కూడా ఆలోచించవలసిన అవసరం ఉన్నది. మనం ఒకప్పుడు హాకీ ఛాంపియన్లు, క్రికెట్ ఛాంపియన్లుగా ఉండేవాళ్ళం. చెస్, బ్యాడ్మింటన్, బిల్లియర్డ్స్‌లో వరల్డ్ ఛాంపియన్స్ గల దేశం మనది. జనాభాలో ఒక్క చైనాకు తరవాత ద్వితీయ స్థానంలో ఉన్నాం. కాని క్రీడారంగంలో మాత్రం జమైకా, కీన్యా వంటి అతి చిన్న దేశాలకన్నా కూడా వెనుకబడి ఉన్నాం.

పతకాలు సాధించిన వారికి దేశవ్యాప్తంగా అభినందనలే కాకుండా బహుమతులు కూడా వెల్లువెత్తడం ఆనందించ తగ్గ విషయమే. అయితే, వాటిలో కొంత శాతమైనా పోటీలలో పాల్గొన్న వారికి ముందుగానే లభించి ఉన్నట్టయితే అధునాతన సౌకర్యాలతో మంచి కోచెస్ ద్వారా శిక్షణ పొంది, మరింత మెరుగైన ఫలితాలు పొందడానికి అవకాశాలు ఉండేవి. గ్రామీణ ప్రాంతాల నుంచి వచ్చే ప్రతిభాశాలురైన క్రీడాకారులకు ఆర్థిక భద్రతాలోపం, ఆధునిక పరికరాలు లేకపోవడం ప్రధాన అవరోధాలుగా ఉంటున్నాయి. వాటిని అధిగమింపజేయడానికి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలూ, క్రీడా సంస్థలూ, కార్పొరేట్ సంస్థలూ తగిన చర్యలు చేపట్టాలి. క్రీడలకు సరైన ప్రాముఖ్యతనిచ్చి లక్ష్యాలను నిర్దేశించుకుని వాటి సాధనకు ఇప్పటి నుంచే కృషిచేయాలి!

సంపాదకుడు : **విశ్వం**







**Founded by B. Nagi Reddi and Chakrapani**

***Editor, Publisher :*** B. Viswanatha Reddi (Viswam)
***Chief Executive Officer :*** L. Subramanyan
***Editorial Advisors :*** Ruskin Bond, Manoj Das
***Consultant Editor :*** K. Ramakrishnan
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** Jayapandian
***Assistant Editor :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designer :*** B.A. Hemalata Malini

***CIRCULATION TEAM :***
***Chennai :*** T N Ravi Shankar, ***National Sales Manager***
Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
Fazal Khan, ***Manager-Circulation & Institutional Sales - South***
Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
***Mumbai : Rajendra K Jadhav, Asst. Manager - Circulation***
Mobile +91 9271720669
**CHANDAMAMA INDIA LTD.,** B-3, Lunic Industry
Opp. State Bank of India, Near Police Station Cross Road
No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi : Sushil Sharma, Circulation Manager-North***
Mobile +91 98719 30767
**CHANDAMAMA INDIA LTD.,** Goyal Business Centre,
C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
***Bangalore : P. Murali, Asst. Circulation Manager-Karnataka***
Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street
Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage
Bangalore-560094, Phone +91 80 6655 1000
email: murali.p@chandamama.com
***Kolkata : Ananth Prakash, Circulation Manager-East***
Mobile +91 98362 82202
email : ananth.prakash@chandamama.com
***Ahmedabad : Kalpesh Raval, Sales Officer-Circulation***
Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
***Head - Business Dev. & Online : Surajit Agarwal***
email : surajit@chandamama.com
***Advertisement :*** email : sales@chandamama.com
***Subscription Queries:*** L. Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
JVL Plaza, Block-A, 6th Floor, 626, Anna Salai,
Teynampet CHENNAI-600018
Phone +91 44 2432 2101/02, Fax +91 44 2432 2103
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

**ANNUAL SUBSCRIPTION :**
India : Rs 180 (by bookpost)
Foreign : US$30 (by air mail)


# పాఠకుల లేఖలు



బాల్యం నుంచి నేను చందమామ అభిమానిని. చందమామ సృష్టించిన ఊహాలోకంలో నా బాల్యమంతా స్వేచ్ఛగా విహరించాను.

ఆగస్టులో ప్రచురించిన కథలు ఆద్యంతం అలరించాయి. 'నట్టింట్లో పిశాచి' మనిషిలోని స్వార్థ బుద్ధి ఎలాంటి అరిష్టాలను కొనితెచ్చుకుంటుందో వివరించింది. మనోదౌర్బల్యంతో బాధపడే యువకుడు మనోవికారాలను అధిగమించి సామ్రాజ్య నిర్మాతగా ఎలా మారాడన్న చారిత్రకాంశం-నిరాశాజీవులకు ఆత్మ స్థైర్యాన్ని అందిస్తుంది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని హడలెత్తించిన నానాసాహెబ్ స్వాతంత్ర్యేచ్ఛ అద్భుతంగా వ్యక్తీకరించబడింది. యుక్తితో సమస్యలను ఏ విధంగా పరిష్కరించుకోవచ్చో 'పొరుగుపోరు' కథలో మాలతి పాత్ర నిరూపించింది. ఏకలవ్యుడి నిస్వార్థ గురుభక్తిని మరింత విపులంగా చెబితే బావుండేది. ప్రాచీన భారతీయ సాహిత్య సౌరభాలను అందిస్తున్న చందమామకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

– పి.బి. భాస్కరరావు,
చెల్లూరు – **533 261**, తూ.గో. జిల్లా (ఆం.ప్ర)

ఒక్క క్షణం చాలు జీవిత పయనాన్ని తల్లకిందులు చేయడానికి అన్న సత్యాన్ని చాటిచెప్పిన రాబర్ట్‌క్లైవ్ ఉదంతం చాలా బావుంది. ఇంట్లోని పోరు ఇంతంతకాదన్న వేమన్న సూక్తిని స్ఫురింపజేసిన 'నట్టింట్లో పిశాచి' అద్భుతం. పిల్లల్ని ఆలోచింపజేసే ప్రహేళికలను, పోటీలను ప్రవేశపెట్టాలని వినయపూర్వకమైన మనవి.

–ఎం. లక్ష్మి, గోపాలపూర్

పిల్లలతో పాటు వయోభేదం లేకుండా అందరూ చదివే ఏకైక పత్రిక చందమామ. ఏ రంగంలో ఏ మార్పులు వచ్చి రూపాంతరం చెందినా మన చందమామ యథాతథంగా ఉండడమే ఆనందకరం!

–ఎం.వి. రమణకుమారి, హైదరాబాద్



# ఒక వివరణ... ఒక వినతి...

ప్రియమైన పాఠకులకు,

1947 నుంచి చందమామ మన బాల్యంలో అంతర్భాగంగా ఉంటోంది. మీరూ, మీకు మునుపటి రెండు తరాల పాఠకులూ చందమామ కుటుంబంలో అంతర్భాగంగా ఉంటూ 61 సం.లకు పైగా దారి చూపుతున్నారు. పిల్లలూ, పెద్దలూ అంటూ అశేష పాఠకలోకం కనబరుస్తూన్న ఆదరాభిమానాల కారణం గానే అరవై వసంతాలు పూర్తిచేసుకుని పత్రిక నిత్య నూతనంగా ముందుకు సాగుతోంది.

ద్రవ్యోల్బణం కారణంగా ఇటీవల మారిన పరిస్థితులు పాఠకులకు తెలియనిది కాదు. దాని కారణంగా విపరీతంగా పెరిగిన కాగితం ధర, పత్రిక ప్రచురణావ్యయం, మౌలిక సదుపాయాల కల్పనా వ్యయం, కార్యాలయ నిర్వహణా వ్యయం అనూహ్యంగా పెరిగిపోయాయి. ఆ భారం పాఠకులపై పడకూడదని గత సంవత్సర కాలంగా రకరకాల పద్ధతులలో మా శాయశక్తులా ప్రయత్నించాం. కాని ఇప్పుడు మరో మార్గం కానరాని నిర్బంధ పరిస్థితి ఎదు రయింది.

ద్రవ్యోల్బణ ఒత్తిడుల పర్యవసానంగా మీ అభిమాన పత్రిక ధరను పెంచడం తప్ప మరో మార్గం కనిపించడం లేదు. తెలుగుతో సహా ఇతర భాషల చందమామ విడిప్రతి వెలను నవంబర్ నుంచి 5 రూ. పెంచడం వల్ల రూ. 20లు అవుతుంది. పర్యవసానంగా సంవత్సర చందా కూడా పెరుగుతుంది. ఈ సందర్భంగా మేము తీసుకురానున్న మార్పులు మీ పరిపూర్ణ హర్షామోదాలను పొందగలవని విశ్వసిస్తున్నాం. వీలయినప్పుడల్లా డివిడి, విసిడి లాంటి వాటిని ఇవ్వడం కొనసాగిస్తాం.

మా క్లిష్ట పరిస్థితిని, పత్రిక ధర పెంచడంలో గల కారణాలను సహృదయంతో అర్థం చేసుకోగలరని విశ్వసిస్తున్నాం.

ఎప్పటిలాగే మీ హృదయపూర్వక సహకారం, ఆదరణ లభించగలవని ఆశిస్తున్నాం.

–ప్రచురణకర్త



Colgate

# రక్షించిన డాక్టర్ ర్యాబిట్




ఎలి, పులి జాల్మానదీ తీరంలో కూర్చుని ఉండగా ఉన్నట్టుండి రంగూ అంకుల్ అక్కడికి ఏడుస్తూ వచ్చాడు.




రంగూ అంకుల్ మరేమీ మాట్లాడకుండా నోరు మూసుకుని కుమికుమిలి ఏడ్వసాగాడు. చాలా సేపు ఓదార్చాక నోరు విప్పాడు. ...అవును నిజంగానే నోరు తెరిచి చూపాడు. దంతాలు కనబడేలా నోరు బార్లా తెరిచాడు.













దంతదేవతా, దంతదేవతా! అంకుల్ రంగూ భయపడి పోయాడు. అతడి పై దంతాలు, కింది దంతాలు, ముందు దంతాలు, వెనక దంతాలు, పక్కదంతాలు అన్నీ బాగుపడే దారి చూపి సాయంచేయవూ!




దంతదేవత ప్రత్యక్షమయింది.
ఎలీ, పులీ! నా నుంచి మీకు ఎలాంటి సాయంకావాలో చెప్పండి?
జంగ్ల్యాండంతా దెబ్బ తిన్నది. జంతువుల దంతాలన్నీ పుచ్చి పోయి, రాలిపోతున్నాయి. దీని కేదైనా తరుణోపాయం చూపాలి!


అక్టోబర్ నెలలో కోల్గేట్ ఉచిత దంత పరీక్షాశిబిరాలు నిర్వహిస్తున్నది. చూస్తూంటే, మీ కందరికీ అది అవసరమనిపిస్తోంది! ఆలే దగ్గరికి వెళితే, అది అవసరమైన సాయం చేయగలదు!
మేమందరం ఇప్పుడే బయలుదేరుతాం!
అంకుల్ రంగా, మిగిలిన జంతువులూ కృతజ్ఞతతో మోకరిల్లాయి.


ఎలీ, పులీ మూటాముల్లె సర్దుకుని ర్యాబిట్ ఆలే వద్దకు బయలుదేరాయి.
డా. ఆలేగారున్నారా? మా దంత సమస్యల పరిష్కారానికి మార్గం చూపి సాయపడండి.
ఇది ఓరల్ హెల్త్‌మంత్! కాబట్టి మొదట ఉచితంగా దంతపరీక్ష చేయించుకోండి!


చాలా అద్భుతం!
మీ పోస్టల్ పిన్ కోడ్‌ను 5676725కు ఎస్ ఎమ్ ఎస్ చేసి మీ ప్రాంతానికి వచ్చే దంతవైద్యుల వివరాలను తెలుసుకోండి.


చాలా బావుంది! అక్కడ హుషారుగా కనిపిస్తున్న ర్యాబిట్ ఎవరు?
ఆయనే డా. ర్యాబిట్, మన దంతవైద్యుడు!
ఇంకా దేనికలా చూస్తున్నారు. హాయిగా నవ్వేయండి!


రోజూ రెండుసార్లు పళ్ళుతోముకోండి. పోషక పదార్థాలుగల ఆహారం తీసుకోండి. నిజంగానే మేలు చేసే డెంటల్ ఎయిడ్స్‌ను ఉపయోగించండి. ఏది ఎలా ఉన్నా ఆరు నెలల కోసారి మీ దంతవైద్యుడి వద్దకు వెళ్ళి చూపించుకోండి. మూడు నెలలకోసారి మీ టూత్ బ్రష్‌ను మార్చండి!
Colgate
Bright Smiles, Bright Futures


ఇండియాలో కోల్గేట్ మరియు ఇండియన్ డెంటల్ అసోసియేషన్ ద్వారా 200 నగరాలలో కోల్గేట్స్ ఓరల్ హెల్త్‌మంత్ నిర్వహించ బడుతోందని డాక్టర్ మాకు చెప్పాడు. 10,000 పైగా దంతవైద్యులు ఇందులో పాల్గొంటున్నారు!
ఆహా! మన సమస్యలన్నీ పరిష్కారమై పోతాయి!



వస్తోంది వస్తోంది బిరబిరా వస్తోంది!
చిన్నారుల ప్రతిభను ఉత్తేజపరచే
సిసిడిఓ మన నగరానికి వచ్చేస్తోంది!
ఎదఎదలో ఉత్సాహపు మువ్వల గలగల
మోగించిన కార్యక్రమాలు మెరిశాయి మిలమిల!!





# లైట్స్! కెమెరా! యాక్షన్! సిసిడిఓ!

ఆగస్ట్ 16వ తేదీ చెన్నయ్ వళ్ళువర్ కోట్టంలో ప్రారంభమైన చందమామ చిల్డ్రన్స్ డే అవుట్ కార్యక్రమాలు కోయంబత్తూరు, హైదరాబాదు నగరాలలోనూ వైభవంగా జరిగాయి.

చెన్నయ్‌లో నిర్వహించిన సింగిల్-వికెట్ క్రికెట్, పెయింటింగ్, క్లే మోడలింగ్, డిబేట్, స్టోరీ టెల్లింగ్ పోటీలలో అసంఖ్యాకులైన పిల్లలు ఉత్సాహంతో పాల్గొన్నారు. సుప్రసిద్ధ సినీదర్శకులు సింగీతం శ్రీనివాసరావు, కార్టూనిస్ట్-సినీ విమర్శకుడు శ్రీ మదన్, క్రికెటర్ శ్రీ వి.బి. చంద్రశేఖర్, ఆర్టిస్ట్ శ్రీ సుకాంత్ మిశ్రా న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు.

ఇండియన్ క్రికెట్ టీమ్ మాజీ కేప్టన్ శ్రీ కృష్ణమాచారి శ్రీకాంత్ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు. ప్రథమ బహుమతీ విజేతలు ఆయన చేతుల మీదుగా ట్రోఫీలు అందుకుని అవధులు లేని ఆనందం పొందారు.



తమ అభిమాన చుట్టి టీవీ పాత్రలతో మాట్లాడాలని పిల్లలు ఇంకా చందమామకు ఫోన్ చేస్తూనే ఉన్నారు. చుట్టి టీవీ చేసిన సిసిడిఓ ప్రకటనలు అంత పెద్ద ఇంపాక్ట్ కలిగించాయి!

కోయంబత్తూరు కొడిసియా హాల్లో ఆగస్ట్ 24వ తేదీ జరిగిన కార్యక్రమంలో పెయింటింగ్, క్లేమోడలింగ్, స్టోరీ టెల్లింగ్ పోటీలు జరిగాయి. స్టోరీ టెల్లింగ్ ఈవెంట్లో పిల్లల రచనాశక్తిని ప్రోత్సహించాలన్న ఉద్దేశంతో సరికొత్త ప్రయోగాన్ని చేపట్టాం. ఫైనల్ రౌండ్‌కు చేరుకున్న వారికి కథ

ప్రారంభం ఒకటి రెండు వాక్యాలు ఇచ్చి తక్కిన కథను పూర్తి చేయమని చెప్పాం. దాంతో యువరచయితల ఊహలకు రెక్కలొచ్చి ఉన్నత శిఖరాలపై విహరించడం చూడ్డానికి ఎంతో ఆనందం కలిగించింది. ఆ తరవాత సిసిడిఓ హైదరాబాదుకు బయలుదేరింది. ఆగస్టు 31వ తేదీ శ్రీధర్ ఫంక్షన్ ప్లాజాలో పెయింటింగ్, క్లే మోడలింగ్, స్టోరీ టెల్లింగ్, డిబేట్ అంటూ నాలుగు పోటీలు ఏర్పాటు చేయబడ్డాయి. సిసిడిఓ విజేతలను చూడాలంటే www.chandamama.com లాగాన్ చేయండి!

మదన్ ఆన్ ది స్పాట్ క్యారికేచర్ గీసి పాల్గొన్న వారిని చిత్రించడం అందరినీ అలరించింది.



పోటీలలో పాల్గొనడానికి వయోపరిమితి నిబంధన ఉన్నప్పటికీ ఒకటవ తరగతి పిల్లలు కూడా వచ్చి పాలుపంచుకోవడానికి అనుమతి కోరడం మాకెంతో ఆనందం కలిగించింది.



పిల్లలకు తోడుగా వచ్చిన తల్లిదండ్రులు, పెద్దలు-సిసిడిఓకు పెద్ద సంఖ్యలో విచ్చేసిన పిల్లలను, పెద్దలను క్రమబద్ధీకరించడానికి యాజమాన్యం చేసిన ఏర్పాట్లను చూసి ఎంతగానో మెచ్చుకున్నారు. మూడు నగరాల్లో నిర్వహించిన ఈ కార్యక్రమాల్లో పదివేలమందికి పైగా పిల్లలు పాల్గొన్నారు. ట్రోఫీని గెలుచుకన్నా, గెలుచుకోకపోయినా పోటీల్లో పాల్గొన్నామన్న ఆనందంతో చిరునవ్వులు చిందుస్తూ వెనుదిరిగిన పిల్లలను చూస్తూంటే చందమామ టీమ్‌కు తమ కృషి ఫలించిందన్న తృప్తి కలిగింది. చుట్టి టీవీ, హలో ఎఫ్ఎం 106.4, రేడియో ఒన్ 94.3, సూర్యన్ ఎఫ్ఎమ్ 93.5, ఈటీవి2, ఈనాడుకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు

తెలియజేస్తున్నాం. పత్రికలు, ఆన్‌లైన్, టీవీ మాధ్యమాల సహకారం, మద్దతు కారణంగానే ఈ కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించగలిగాం. రాబోయే నెలల్లో సిసిడిఓ మరో 13 నగరాలకు పయనం చేయనున్నది. ముంబైలో ఘనంగా పరిసమాప్తమవుతుంది.

సమాయత్తంకండి! త్వరలో భువనేశ్వర్, కొల్‌కత, గౌహతి నగరాలకు వస్తున్నాం!

మితిమించిన ఉత్సాహం కొద్దీ కొందరు పార్టిసిపెంట్స్ స్పృహ తప్పి పడిపోయారుగాని, అందుబాటులో ఉన్న అంబులెన్స్ సర్వీస్ కారణంగా అలాంటి వారు మళ్ళీ పోటీల్లో పాల్గొన్నారు. ఎలాంటి అవాంఛనీయ సంఘటనా జరగలేదు.





బేతాళ కథలంటే నాకు చాలా ఇష్టం. విక్రమార్కుడు సమాధానం చెప్పేలోగా ప్రశ్నలకు నేను సమాధానం చెప్పడానికి ప్రయత్నించి చూస్తాను.

– యువేధ, విద్యార్థిని





చిన్నప్పుడు అంబులిమామ (చందమామ) చదివేవాణ్ణి. అయితే ఇవాళ్టి పిల్లల మొత్తం సమయాన్ని టీవీలు ఆక్రమించేశాయి. పిల్లలలో పఠనాసక్తిని పెంపొందించడానికి ఇలాంటి కార్యక్రమాలు ఎంతైనా ఉపయోగపడతాయి.

– ఆర్. జయరామన్, తండ్రి

ఇంతకు ముందు నేనెప్పుడూ ఇలాంటి ఈవెంట్‌లో పాల్గొనలేదు! ఈ బ్యాడ్జ్ నాకెంతో ఇష్టం. దీన్ని భద్రంగా దాచుకుంటాను.

– కౌశిక, పార్టిసిపెంట్



YOUNGWORLD

Kaleidoscope

Children's day out

बच्चों की प्रतिभा तराशेगी चन्दामामा

Chandamama to organise 'Children's Day Out'

Chandamama goes talent hunting

'It is indeed heartening that we are venturing into new formats. I always like to interact with children and this competition is another opportunity for me and Chandamama to know today's youngsters better.'



# పాతాళదుర్గం

## 3

[కదంబరాజదూతలు నలుగురు, ఇద్దరు ఖైదీలను వెంటబెట్టుకు వచ్చి, కుంతలదేశ రాజుతో, వాళ్ళే అరణ్యంలో మంత్రికుమారుణ్ణీ, అతడి మిత్రులనూ చంపిన వాళ్ళని చెప్పారు. తరవాత దూతలు ఖైదీలను తీసుకుని తమ దేశానికి పోతూండగా మార్గ మధ్యంలో కుంతలసైనికులు అడ్డు తగిలి వాళ్ళల్లో ఇద్దరి మెడలకు ఉరితాళ్ళు తగిలించి, ఖైదీలను విడిపించారు. -తరవాత]

కదంబరాజదూతలిద్దరూ తమ గుర్రాలతో కొండవాగు దాటి, తమ రాజ్యంలో ప్రవేశించారు. కుంతల సైనికులు వదిలిన బాణాలేవీ వారికి తగల లేదు. అర్ధరాత్రి, గుడ్డి వెన్నెల, అరణ్యప్రదేశం. ఆ కారణాలవల్ల సైనికులు దూతల మీదికి గురిచూసి బాణాలు వదలలేకపోయారు.

''వాగు దాటి ఆ దూతల వెంట పడటంలో ప్రమాదం ఉన్నది. వాళ్ళకు కదంబరాజ్య సరిహద్దు కాపలావాళ్ళు సహాయంగా రావచ్చు. ఏమైనా ఆ ఇద్దర్నీ ప్రాణాలతో పోనివ్వకూడదు. మీలో ఎవరు శత్రు రాజ్యంలో జొరబడి, వాళ్ళను వేటాడగలరో చెప్పండి. వాళ్ళను చంపిన వాళ్ళకు మంత్రిగారు పెద్ద బహుమానం ఇస్తారు,'' అన్నాడు కుంతల సైనికుల నాయకుడు.

ఆ మాట వింటూనే ధూమకుడు ముందుకు వచ్చి, ''అయ్యా, నేనూ, సోమకుడూ ఆ పని

'చందమామ'



రావలసి వుంటుంది,'' అన్నాడు సైనికుల నాయకుడు.

ఆ వెంటనే ధూమక సోమకులు, సైనికు లిచ్చిన కత్తులు తీసుకుని, గుర్రాలెక్కి దూతలు వాగు దాటిన ప్రదేశంలోనే తామూ వాగు దాటి, వాళ్ళను వెతుకుతూ కదంబనగరం కేసి బయలుదేరారు.

ఆ ప్రదేశమంతా కొండలమయం. మహా వృక్షాలతో, ముళ్ళపొదలతో ఆ ప్రాంతమంతా, చీకటిలో మహాభయంకరంగా వున్నది. అడవి మృగాలు నీటి మడుగుల దగ్గిరకు రాక పోకలు జరిపే కాలిబాటల వెంట, జాగ్రత్తగా తమ గుర్రాలను నడుపుతూ, ఎక్కడైనా అలికిడి అయిన జాడ కోసం చెవులు రిక్కించి వింటూ ధూమక సోమకులు అరణ్యంలో చాలా దూరం వెళ్ళారు. కాని, వాళ్ళకు దూతల జాడ కనిపించలేదు.

చేయగలం. మాకు మీరిచ్చే గొప్పగొప్ప బహు మానాలేవీ అవసరం లేదు. ఆ దూతల్నే కాకుండా కదంబరాజునూ, మంత్రినీ కూడా మేము చంపి తీరతాం. ఆ దుర్మార్గులు చెప్పి నట్టు మేము పితృ, భ్రాతృ హంతకులమేం కాదు. శిస్తు భారం మోయలేక ఉగ్రసేన రాజుకు ఎదురుతిరిగిన గ్రామస్థులం,'' అన్నాడు.

''మా మంత్రిగారికి మీరు హంతకులు కాదన్న అనుమానం కలిగే, మిమ్ములను బంధవిముక్తుల్ని చేయమని, నాకు ఆజ్ఞ ఇచ్చారు. సరే, మాటలతో కాలయాపన అయిపోతున్నది. ఈ రెండు గుర్రాలూ, ఈ కత్తులూ తీసుకుని వేట ప్రారంభించండి. బహుమానం కావలిసివస్తే మాత్రం, ఆ దూతల శిరస్సులు మా మంత్రిగారి దగ్గిరకు తీసుకు

''సోమూ! ఈ చీకట్లో ఆ దుర్మార్గుల్ని వెతికిపట్టటం అయ్యేపని కాదు. ముందు మన గ్రామం వెళ్ళి మన కుటుంబాలను సరి హద్దులు దాటించి కుంతలరాజ్యం చేరుద్దాం,'' అన్నాడు ధూమకుడు.

సోమకుడు అడ్డంగా తలాడించి, ''ఉగ్ర సేనరాజు చావు చూడందే, నేను గ్రామంరాను. పన్ను కట్టలేనంత మాత్రాన నన్ను ఖైదు చేసి, అమానుషమైన నానా హింసలకూ గురి చేస్తాడా? పైగా నేను భ్రాతృహంతకుణ్ణా!'' అన్నాడు రోషంగా.

''నీ మొండితనం మాను, సోమూ! రాజు అంత తేలిగ్గా మన చేతిక చిక్కుతాడనుకు

న్నావా? అతడి చుట్టూ ఎంతమంది అంగరక్ష కులుంటారో తెలుసా? నేనూ నీతో పాటు హింసలపాలయిన వాణ్ణే. పారిపోయిన ఇద్దరు దూతలూ మన మీద రాజుకు కొండేలు చెప్పి, ఉరితీత పడిన దూతల చావుకు మనమే కారణం అని ఆయన చేత గట్టిగా నమ్మిస్తారు. అప్పుడు మన కుటుంబాల గతి ఏమవు తుందో ఆలోచించావా?'' అన్నాడు ధూమ కుడు.

ఆ మాటలతో సోమకుడు కొంచెం మెత్త బడ్డాడు. అతడికీ ముందు తమ కుటుంబాల రక్షణ విషయం జాగ్రత్త పడటం మేలనిపిం చింది. ''సరే, నువ్వు చెప్పినట్టే చేద్దాం, పద!'' అంటూ సోమకుడు గుర్రాన్ని మరొక దారికి మళ్ళించాడు.

ధూమకుడు కూడా తన గుర్రాన్ని మళ్ళించ బోయేంతలో, నగరం వైపు నుంచి పెద్ద వెలుగు కనిపించింది. ఇద్దరూ ఆశ్చర్య పడుతూ అటు కేసి తలలు తిప్పారు. కోట గోడల మీద నుంచి మండుతున్న బాణాలు అరణ్యం కేసి వచ్చి పడుతున్నవి. నగారా మోతలూ, అతిభీకర భేరిభాంకార ధ్వనులూ ఒక్కుమ్మడిగా దిక్కులను పిక్కటిల్ల చేస్తు న్నవి.

''నగరాన్ని మనవాళ్ళు ముట్టడించారు. రాజు హతం! మనం కూడా వెళ్ళి నగరం మీద పడదాం,'' అంటూ సోమకుడు గుర్రాన్ని పక్కకు తిప్పాడు.

ధూమకుడు అతణ్ణి వారిస్తూ, ''తొందర పడకు. కదంబనగరాన్ని ముట్టడించగల శక్తి



మన పేద గ్రామీణుల కెక్కడ వున్నది? మనం గుడ్డిగా నగరం కేసి పరిగెత్తితే, మళ్ళీ రాజుకు ఖైదీలుగా చిక్కుతాం. కాలిబాటలు వదిలి, జాగ్రత్తగా చెట్ల మాటున ముందుకుపోయి, ఆ రణ గొణ ధ్వనికీ, మంటల బాణాలకూ కారణం ఏమిటో తెలుసుకుందాం,'' అన్నాడు ధూమకుడు.

కదంబనగరంలో రేగిన కల్లోలానికి కారణం, సోమకుడనుకున్నట్టు పన్నుల భారం మోయ లేని గ్రామీణులు చేసిన దాడి కాదు. ఆ రోజు-సరిగ్గా అర్ధరాత్రి వేళ ఒక మహా కాయుడు, కోట చుట్టూ వున్న అగడ్తను నాలుగైదు అంగల్లో దాటి, మూసి వున్న నగర ద్వారాలను బలంగా తట్టాడు.

''ఎవడు వాడు? ద్వారాలు విరిగిపోయేలా తట్టుతున్నాడు, బుద్ధి లేదా! సూర్యోదయం



అయితేగాని ద్వారాలు తెరవబడవ్!'' అంటూ ద్వారరక్షకులు కేకవేశారు.

''నేనెవణ్ణా? రాజాధిరాజును!'' అంటూ మహాకాయుడు ఒక్క ముష్టిఘాతంతో తలుపులను ఫెళఫెళమంటూ వెనక్కు విరుచుకు పడేలా చేశాడు. ద్వారరక్షకుల్లో కొందరు వాటి కింద చిక్కుకుపోయి విల విలా తన్నుకుంటున్నారు. మిగిలినవారు విరిగిన ద్వారం నుంచి లోపల ప్రవేశించిన నల్లని పర్వతాకారుణ్ణి చూసి భయకంపితులై మూర్ఛపోయారు.

''మీరిలాగే చచ్చినట్టు పడివున్నారో, చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళయినా బతుకుతారు. అలా కాక, కోటలోకి పరిగెత్తి హెచ్చరికలు చేశారో, మెడలు విరిచేస్తాను,'' అన్నాడు మహాకాయుడు.

ఆ మాటలతో ప్రాణభయం పోయిన ద్వారరక్షకుల్లో కొందరు అతడి కేసి చూశారు. ఆ మహాకాయుడు చర్మాలు ధరించి వున్నాడు. కళ్ళు నిప్పుకణాల్లా మెరుస్తున్నవి. తల మీద మెలికలు తిరిగిన రెండు కొమ్ములున్నవి. చేతిలో ముళ్ళు చెక్కిన పెద్ద రాతిగదలాంటిది వున్నది.

''రాక్షస దొరా! నువ్వేలోకం వాడివో మాకు తెలీదు. నగరంలో మీ ఇష్టంవచ్చిన వాళ్ళను తినెయ్యండి. కాని, అదుగో, ఆ రాజమార్గానికి ఎడమవైపు నున్న ఎర్రచారలగోడ ఇంటి వాళ్ళను మాత్రం ఏమీ చెయ్యకండి. ఆ ఇంట్లో నా పెళ్ళాంబిడ్డలున్నారు,'' అన్నాడొక ద్వారరక్షకుడు.

రాక్షసుడు విరగబడి నవ్వాడు. ''ఒరే మూర్ఖా! నేను మనుషుల్ని తినేందుకు మరో లోకం నుంచి వచ్చిన రాక్షసుణ్ణనుకున్నావా? కాదు, కాదు. నేనిక్కడివాణ్ణే, దండకారణ్యం వాణ్ణి! మానవులతో మా రాజుగారికి వియ్యమందాలని బుద్ధి పుట్టింది. మీ రాజుకూతురు మహా చక్కని చుక్కటే!'' అంటూ రాక్షసుడు, నిశ్శబ్దంగా రాజభవనం కేసి నడిచి పోయాడు.

భవన ప్రధానద్వారం వద్ద కాపలావాళ్ళిద్దరు చురుగ్గా పహరా తిరుగుతున్నారు. మరి నలుగురు ఒక నెగడు చుట్టూ కూర్చుని కబుర్లాడుతున్నారు. రాక్షసుడు వాళ్ళ కెదురుగా బాట కవతల వున్న ఒక వృక్షం కింది చీకటిలో కొద్దిసేపు నిలబడి, ద్వారం కేసి బయలుదేరిన వాడల్లా అంతలోనే ఆగి, మరి

కొంత దూరం చెట్లకింది చీకటిలో నడిచి పోయి, భవనప్రాకారాన్ని సమీపించి, దాని మీదుగా లోపలికి దూకాడు. అలా దూక టంలో అతడి కాలొకటి ప్రాకారానికి తగిలి, పెద్ద శబ్దంతో అందులోని కొంతభాగం విరిగి కిందపడింది.

ఆ వెంటనే భవనంలో గొప్ప సంచలనం బయలుదేరింది. ''శత్రుసైన్యాలు! శత్రు సైన్యాలు!'' అంటూ కొందరు కేకలు పెట్టారు. ''భూకంపం! భూకంపం!'' అంటూ మరి కొందరు భయంతో అరిచారు.

రాజ ప్రాసాదంలోని నౌకర్లూ చాకర్లూ అందరూ కిందికి పరిగెత్తుకుంటూ వచ్చి, కూలిపోయిన ప్రాకారపు గోడను చూసి ఆశ్చర్యపడసాగారు.

రాజకుమార్తె కాంతిసేనకు భవనంలో రేగిన గగ్గోలుకు నిద్రాభంగమై, తన గది నుంచి బయటికి వచ్చి, పిట్టగోడ నానుకుని నిలబడి కిందికి చూడసాగింది. ఆమె చెలికత్తె లిద్దరు ఆమె పక్కన చేరి, ''ఎంత పెద్ద ధ్వన యింది! అందరం భూకంపం వచ్చిందను కున్నాం,'' అంటూ కళ్ళింత చేసి, చేతులు ఊపుతూ, ఆమెకు కూలిన గోడ చూప సాగారు.

రాక్షసుడు నిశ్శబ్దంగా మెట్లెక్కి రాజకుమార్తె వున్న అంతస్తుకు పోయాడు. దారిలో అతడికి నౌకర్లెవరూ ఎదురవలేదు. వాళ్ళందరూ కాగడాలు వెలిగించుకుని, ప్రాకారం దగ్గిరకు వెళ్ళిపోయారు. రాక్షసుడు మెట్లెక్కి పైభాగా నికివెళుతూండగా, అతడి తల నీడ ముందుగా



రాజకుమార్తెవున్న చోట పడింది. దాన్ని చూస్తూనే కాంతిసేన అదిరిపడింది. చెలి కత్తెలు భయకంపితులై నీడ, పై నుంచి పడు తున్నదేమో అనుకుని ఆకాశం కేసి చూశారు. అంతలో రాక్షసుడు ఆఖరు మెట్టెక్కి, పై అంతస్తు చేరి చిన్నగొంతుతో, ''నేను మీ కెవరికీ హాని చేయను. అయినా, మీలో ఎవరైనా మూర్ఛ పోదలిస్తే, పొండి. కాని, కేకలు పెట్టి గొడవచేశారో, గొంతులు పిసి కేస్తాను,'' అన్నాడు.

రాజకుమార్తె భయకంపితురాలై, మూర్ఛ పోయింది. చెలికత్తె లామెను కింద పడి పోకుండా చేతులతో ఆదుకున్నారు. రాక్ష సుడు వాళ్ళను సమీపించి, కాంతిసేనను మృదువుగా పట్టుకుని పైకెత్తి భుజాన వేసు కుని, చెలికత్తెలతో, ''అందంలో మీరు

రాజకుమార్తె కేమీ తీసిపోరు. నా వెంట వస్తారా? శౌర్యసాహసాలు గల మా యువకుల్ని చేసుకుందురుగాని. వాళ్ళ అందచందాల మాట మాత్రం అడగవలిసిన పని లేదు. నన్ను చూశారుగదా? నా అంత చక్కగానూ వుంటారు,'' అన్నాడు.

చెలికత్తెలా మాటలు వింటూనే కూడ బలుక్కున్నట్టు, ఒక్కసారిగా మూర్ఛపోయారు. రాక్షసుడు, కాంతిసేనతో మెట్లు దిగివచ్చి, ఈ సారి ప్రాకారంగోడ ఎక్కడ దాటటమా అని ఆలోచించేంతలో, రాజుగారి నౌకరొకడు అటుగా వచ్చి, అతణ్ణి చూసి, ''రాక్షసుడు! రాజకుమారినెత్తుకు పోతున్నాడు!'' అంటూ కేకపెట్టాడు.

రాక్షసుడు చప్పున ఉద్యానవనం కేసి పరిగెత్తి, అక్కడ చెట్ల చాటున నిలబడ్డాడు. అతడికి రాజసేవకుల్లో ఎవర్ని చంపటమూ ఇష్టం లేదు. రాజకుమార్తెను సురక్షితంగా ఎత్తుకుపోవటం ఒక్కటే అతడు కోరుతున్నది. ఆ కారణంగా, అతడు కాగడాలూ, కత్తులూ తీసుకుని ఉద్యానవనంలోకి వస్తున్న రాజభటుల మీదికి పోకుండా, కొద్ది క్షణాలు ఆలోచించి ఉన్నట్టుండి గోడ దూకి, నగర ద్వారాల కేసి పరిగెత్తాడు.

ఆ సరికి రాజు ఉగ్రసేనుడూ, మంత్రీ నిద్రమేలుకుని, మేడ పైభాగానికి వచ్చారు. ఉగ్రసేనుడికి పారిపోతున్న రాక్షసుడి భుజం మీద తన కుమార్తె కనిపించింది. భటులు కొందరు రాక్షసుడి మీదికి గురిచేసి బాణాలు వదులుతున్నారు. వాటిల్లో ఒకటీ అరా వచ్చి తగిలినా, అతడేమీ లెక్క చెయ్యకుండా, నగరద్వారాలు దాటి, అరణ్యమార్గం పట్టాడు.

''కోట బురుజుల మీది నుంచి అగ్ని బాణాలు ప్రయోగించి, అరణ్యంలో వాడెటు పోతున్నదీ చూడండి. ఈ లోపల ఆశ్వికులు వాడి వెన్నంటిపోయి చుట్టుముట్టండి. రాక్షసుణ్ణి హతమార్చేందుకు నేనే స్వయంగా వస్తున్నాను,'' అంటూ ఉగ్రసేనుడు పెద్దగా కేకపెట్టాడు.

వెంటనే సైనికులు బాణాలకు నూనెరాసిన గుడ్డలు చుట్టి, వాటిని వెలిగించి, రాక్షసుడు పోయిన మార్గం కేసి వదలసాగారు. ఆశ్విక భటులు కొందరు వేగంగా నగరద్వారాలు దాటి రాక్షసుడి వెంట పడ్డారు. -(ఇంకావుంది)





# వింత ప్రేమ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఎవరి అభిమానం పొందగోరి భీతికొలిపే వాతావరణంలో ఇలా శ్రమపడుతున్నావో నాకు తెలియదు. అయితే, జీవితంలో ఒక్కొక్కసారి కొందరికి తమకు అసలు సంబంధం లేనివారి చర్యల కారణంగా పడరానిపాట్లకు గురయ్యే విపరీత పరిస్థితులు ఎదురవుతూ ఉంటాయి. ప్రజలను క్రూరమృగాల బెడదనుంచి రక్షించడానికి వేటకు వెళ్ళి, అడవిలో అనూహ్య పరిణామాలకు లోనైన యశోధనుడనే యువరాజు వింత ప్రేమ కథ చెబుతాను, శ్రమ

బేతాళ కథలు



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

నిషధ రాజకుమారుడు యశోధనుడు శౌర్య పరాక్రమాలలో సాటి లేనివాడు. ప్రజల క్షేమం పట్ల చాలా శ్రద్ధకలవాడు. గ్రామప్రాంతాలలో క్రూరమృగాల బెడద పెచ్చరిల్లి పోవడంతో, వాటిని వేటాడడానికి యశోధనుడు కొద్ది మంది అనుచరులతో కలిసి ఒకనాడు అడవికి వెళ్ళాడు.

అదేసమయంలో గంధర్వలోకానికిచెందిన అజరుడు, చతుస్వరి అనే ఇద్దరు ప్రేయసీ ప్రియులు భూలోక విహారానికి వచ్చి అందమైన ఒక కొండ మీదికి దిగారు. ఇరువురూ ఒక బండ మీద కూర్చున్నాక అజరుడు, ''ఈ లోకంలోని ఎత్తయిన పర్వతాలు, సుందరమైన జలపాతాలు, తటాకాలు, అనలు కొనలుగా విస్తరించిన మహావృక్షాలు, వాటిని అల్లుకున్న పుష్పలతలు, వాటి మధ్య తిరిగే జంతువులు, ఎగిరే పక్షులు మొదలైనవన్నీ మనోహర దృశ్యాలే. అయితే, నువ్వే వీటన్నిటి కన్నా అందంగా కనిపిస్తున్నావు,'' అన్నాడు.

వారు కూర్చున్న ఎత్తయిన ప్రదేశం నుంచి, దిగువగా అడవిలో క్రూర మృగాలను తరిమి తరిమి వేటాడుతూన్న యశోధనుడు కనిపిస్తున్నాడు. వేటాడడంలో అతడి చాతుర్యం ఎంతో ఆకట్టుకోవడంతో చతుస్వరి ఆ దృశ్యాన్ని రెప్ప వేయకుండా చూస్తూండి పోయింది. అజరుడి మాటలు ఆమె చెవికెక్క లేదు. దాంతో అతడికి ఆగ్రహం కలిగి, ''నేనెంతో అభిమానంతో చెబుతూ ఉంటే నా మాటలు పట్టించుకోకుండా వాడి వైపు చూస్తావా? ఒక సామాన్య మానవుడి శౌర్య పరాక్రమాలు ఏపాటివి? ఈ క్షణంలో వాడినేం చేస్తానో చూడు,'' అంటూ యశోధనుణ్ణి బెత్తెడు ప్రమాణంలో సూక్ష్మ రూపుడిగా మార్చేశాడు.

అకస్మాత్తుగా తన పరిమాణం కుంచించుకు పోవడంతో దిక్కుతోచని స్థితిలోనున్న యశోధనుణ్ణి అటువైపు వేగంగా పరిగెడుతున్న కుందేలు చెవి తాకింది. ఆ తాకిడికి అతడు మూడు పొర్లులు పొర్లాడు. దాన్ని చూసి అజరుడు పకపకా నవ్వుతూ, ''కన్నార్పకుండా చూశావే, ఇప్పుడు చూడు వాడి ప్రతాపం!'' అన్నాడు.

''నేను కేవలం ఆ మానవ మాత్రుడి వేటాడే నేర్పును చూసి వినోదించాను. అంత మాత్రాన్నే మత్సరంతో అతడిపై అద్భుత శక్తులు ప్రయో

గించి నీ దుష్ట స్వభావాన్ని నిరూపించుకున్నావు. ఈ క్షణం నుంచి నిన్ను నేను ద్వేషిస్తున్నాను,'' అంటూ చతుస్వరి కోపంగా ఆకాశ మార్గాన గంధర్వలోకం వెళ్ళి పోయింది. అజరుడు కూడా కంగారుగా ఆమెను అనుసరించాడు.

యశోధనుడు అయోమయం నుంచి తేరుకోకముందే పెద్ద సుడిగాలి వీచింది. ఒక ఆకు మధ్య చిక్కుకున్న యశోధనుడు సుడిగాలిలో గిర్రున తిరుగుతూ ఆకాశంలోకి లేచాడు. ఆ సుడిగాలి అతణ్ణి చాలా దూరం తీసుకువెళ్ళి విసిరివేసింది. అక్కడి నుంచి కింద పడిపోతూండగా, అప్పుడే అటుగా వెళుతూన్న ఒక రామచిలుక తోకను ఆసరాగా పట్టుకుని, దాని మీదికి ఎక్కి కూర్చున్నాడు.

అది ఆనందగిరి రాజ్యాన్ని పాలించే అనంత భద్రుడి ఏకైక కుమార్తె రాగలత పెంపుడు చిలుక. ఆ చిలుక తిన్నగా అంతఃపురంలోని రాగలత నివాస భవనంలోకి యశోధనుణ్ణి తీసుకువెళ్ళింది. అప్పుడు రాగలత చెలికత్తెలతో కలిసి బంతి ఆట ఆడుకుంటోంది.

వేలి ఉంగరమంత కిరీటం, చిక్కుడు గింజలంత పాదరక్షలు, మిరప తొడిమంత కత్తితో, బెండకాయంత పరిమాణంతో, రాగి గింజలంత నేత్రాలతో వింతరూపంతో ఉన్న యశోధనుణ్ణి చూడగానే యువరాణితో సహా చెలికత్తెలందరూ వచ్చి చుట్టుముట్టారు. ''అద్భుతం! ఇలా కదిలే బొమ్మను నేనింత వరకు చూడలేదు,'' అంటూ రాగలత అతణ్ణి చేతిలోకి తీసుకున్నది.



రాగలత అపురూప సౌందర్యం చూడగానే యశోధనుడు కూడా ఆశ్చర్య చకితుడయ్యాడు. ఆమెపై అభిమానం కలిగింది. అయితే, ప్రస్తుతానికి తాను ఎవరైనదీ చెప్పకూడదనుకున్నాడు. తాను సూక్ష్మ రూపుడిగా మారడానికి కారణం తెలియకపోయినా, ఎప్పటికైనా పూర్వస్థితి వస్తుందన్న విశ్వాసం కలగడంతో, అప్పుడామెను వివాహం చేసుకోవచ్చని ఆశపడ్డాడు.

''నేను బొమ్మను కాను. వీరాధివీరుణ్ణి. నేను ఆజ్ఞాపిస్తే అపార సైన్యం నావెంట నడుస్తుంది. యుద్ధాలలో ఎందరో శత్రువులను ఓడించిన నా శౌర్యపరాక్రమాలు సాటిలేనివి,'' అన్నాడు యశోధనుడు.

''మనిషి ఉన్నది బెత్తెడయినా మాటలు మాత్రం కోటలు దాటుతున్నాయి. పిట్ట



కొంచెం కూతఘనం!'' అంటూ చెలికత్తెలు చతురోక్తులు విసురుతూ కాస్సేపు నవ్వుకున్నారు. యువరాణి మాత్రం అతడి కేసి మౌనంగా చూస్తూ ఉండిపోయింది.

ఆ తరవాత రాగలత యశోధనుడితో ముచ్చటిస్తూ, భోజన సమయంలో, వన విహారానికి వెళ్ళినప్పుడు ఎల్ల వేళలా అతణ్ణి వెంట తీసుకుని వెళ్ళేది. కొన్నాళ్ళకు అతడే ఆమె లోకమయ్యాడు.

రాగలత గొప్ప చిత్రకారిణి. ఒకనాడామె యువరాజు రూపాన్ని మామూలు పరిమాణంతో స్థూలంగా చిత్రించి, ఆ రూపాన్ని అలాగే చూస్తూండగా, వెనక నుంచి యశోధనుడు, ''సుందరీ, నిన్ను నేను ప్రేమిస్తున్నాను, మామూలు రూపం పొంది పెళ్ళాడుతాను,'' అన్నాడు.

ఆ మాటకు ఉలిక్కి పడి వెనక్కు తిరిగి చూసిన యువరాణి చిన్నగా నవ్వుతూ తల వంచుకున్నది.

ఆ దృశ్యాన్ని గంధర్వలోకం నుంచి దివ్య దృష్టితో తిలకించిన అజరుడు చతుస్వరితో, ''చూశావా, ప్రేమ గొప్పదనం. బెత్తెడు ఎత్తున్న వింత శరీరుడని తెలిసినా రాగలత యశోధ నుణ్ణి ప్రేమిస్తోంది. అందం మాత్రం ఉంటే సరిపోదు. యువతులకు హృదయం కూడా కుసుమకోమలంగా ఉండాలి. నీ హృదయం మాత్రం పాషాణశిలాసదృశం,'' అన్నాడు.

''యశోధనుడి జీవితంతో నువ్వు ఇంకా ఆడుకుంటూనే ఉన్నావు. నువ్వు దుర్మార్గుడివి కాదా?'' అన్నది చతుస్వరి నిష్ఠూరంగా.

''నువ్వు నన్ను వివాహమాడతానంటే ఈ క్షణమే అతణ్ణియథా రూపంలోకి మార్చేస్తాను,'' అన్నాడు అజరుడు.

''అవకాశం చూసుకుని ఆంక్షలు విధించే నీలాంటి వాణ్ణి ఎలా ప్రేమించను?'' అంటూ చతుస్వరి విసురుగా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

ఇక్కడ భూలోకంలో కొన్నాళ్ళకు అనంత భద్రుడు కుమార్తెకు వివాహం జరిపించడానికి స్వయంవరం చాటాలనుకున్నాడు. అది తెలిసిన రాగలత, ''స్వయంవరం వద్దు. త్వరలో మీ అభీష్టానుసారం నా వివాహం జరుగుతుంది,'' అని తండ్రికి నచ్చజెప్పింది.

ఆ తరవాత ఉద్యానవనంలోకి వెళ్ళి యశోధనుడితో సంగతి చెప్పి, ''నీకీ వింత రూపం ఎలా వచ్చిందో తెలిస్తే విముక్తి పొందే

మార్గం అన్వేషించవచ్చు. అయినా నీకది తెలియదంటున్నావు. పూర్వం దేవలోకంలో ఎవరి పంతం వల్లనో భూలోకంలోని హరిశ్చంద్రుడు అష్టకష్టాల పాలయ్యాడని పెద్దలు చెబుతారు. చివరికి ఆయన కష్టాలు తొలగిపోయినట్టే, నీకూ నీ అసలు రూపం వచ్చేంత వరకు నేను వేచి ఉంటాను,'' అన్నది గాఢంగా నిట్టూరుస్తూ.

యశోధనుడు ఏమి చెయ్యాలో తెలియక యువరాణి కేసి తదేకంగా చూస్తూండిపోయాడు.

ఆ దృశ్యాన్ని గంధర్వలోకం నుంచి చూసిన చతుస్వరి, ''నీ ద్వేషబుద్ధి యశోధనుణ్ణి ఎంతటి దీనస్థితికి గురిచేసిందో చూశావా?'' అని అడిగింది తనను వెన్నంటి వస్తూన్న అజరుణ్ణి బాధగా.

''ఇప్పటికీ మించిపోయింది లేదు. వివాహానికి అంగీకరించావంటే ఈ క్షణమే యశోధనుణ్ణి యధారూపానికి మార్చేస్తాను,'' అన్నాడు అజరుడు నిర్లిప్తంగా.

అందుకు చతుస్వరి కోపంతో, ''నిష్కారణంగా యశోధనుణ్ణి కష్టాలపాలు చేస్తూన్న నీ దుష్టబుద్ధి సహించరానిది. నువ్వు సాధారణ మానవుడిగా భూలోకంలో కష్టాలు అనుభవించి కరుణ, దయ, ప్రేమ వంటి ఉన్నత గుణాలను అలవరచుకున్నాకే నీకు మానవ రూపం నుంచి విముక్తి. అప్పుడే నన్ను వివాహమాడడానికి అర్హుడివి కాగలవు. నా ప్రేమ నిష్కళంకం గనక, నా శాపం ఫలించి తీరుతుంది,'' అని శపించింది.

మరుక్షణమే అజరుడు మానవరూపంతో భూలోకం చేరాడు. యశోధనుడు మామూలు



రూపం పొంది తాను ఎవరైనదీ తెలియజేసి రాగలత మెడలో పూలమాల వేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, చతుస్వరికి అజరుడి పట్ల అసలు ప్రేమ ఉన్నదా? లేదా? ఉన్నట్టయితే అన్నాళ్ళు అతణ్ణి ఎందుకలా విసిగించింది? మొదటే అతనితో వివాహానికి అంగీకరించి ఉన్నట్టయితే యశోధనుడికి ఎప్పుడో మామూలు రూపం వచ్చి ఉండేది కదా? ఇక యశోధనుడికి మామూలు రూపం రావడానికి కారణం ఏమిటి? రాగలత అతని మీద పెంచుకున్న ప్రేమాభిమానాలే అందుకు కారణమా? మరేదైనా కారణం ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చతుస్వరికి తొలి నుంచీ అజరుడిపట్ల ప్రేమాభిమానాలు ఉన్నాయి. అయితే, తన మీది మితిమించిన ప్రేమకొద్దీ, స్వార్థ జనితమైన అసూయతో అజరుడు కర్తవ్య నిర్వహణ చేస్తూన్న యశోధనుణ్ణి ద్వేషించి అకారణంగా శిక్షించడం ఆమెకు నచ్చలేదు. అతడిలోని ఆ లోపాన్ని సరిదిద్దడానికే ఆమె ప్రయత్నించింది. అతడి దుష్టస్వభావాన్ని ఎత్తి చూపి మార్చుకోమని మందలించింది. అయితే, అజరుడు తన స్వార్థం తప్ప ఎదుటివారి కష్టాలు పట్టించుకునే స్థితిలో లేడు. ఒకరు ప్రయోగించిన అద్భుతశక్తిని మరొకరు ఉపసంహరించే శక్తి గంధర్వులకు లేదు. తన కారణంగా రాగలత-యశోధనులకు ఏర్పడిన సంకట స్థితిని చూసి భరించలేకే అజరుడికి శాపమిచ్చి వారికి సాయపడింది. ఇక రాగలత యశోధనుల ప్రేమాభిమానాలు హృదయ ప్రధానమైనవి; ఉన్నతమైనవి; మానవ సహజమైనవి. అజరుడు మానవరూపం పొందడంతో అతడి అద్భుత శక్తులను కోల్పోయాడు గనక, అతడు యశోధనుడిపై ప్రయోగించిన శక్తులు కూడా తొలగిపోయి, మామూలు రూపం పొందాడు. అజరుడి ద్వేషం యశోధనుడికి చివరికి మేలు చేసిందనే చెప్పాలి,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : గుండ్రాతి సుబ్రహ్మణ్యంగౌడు రచన]



## గ్రహానికి మన ఊరి పేరు




కేరళరాష్ట్రం కొల్లం జిల్లాలోని ఒక గ్రామం పట్టాళి. ఈ సంవత్సరం మే నెలలో నాసా ఒక చిన్న గ్రహానికి దాని పేరు పెట్టింది. అమెరికాలో స్థిరపడిన తమిళనాడు కావలూరుకు చెందిన ఆర్. రాజమ్మోహన్ అనే శాస్త్రవేత్త ఈ గ్రహాన్ని 1989 ఫిబ్రవరి 1వ తేదీ కనుగొన్నాడు. దానికి తాత్కాలికంగా 5178నం. సిడి4 అని పేరుపెట్టారు. పందొమ్మిది సం.ల తరవాత దానికి పట్టాళి అనే శాశ్వతమైన నామకరణం చేయబడింది. కొల్లం శ్రీనారాయణ కాలేజీలో జీవశాస్త్ర ఉపన్యాసకుడుగా పనిచేస్తున్న డా. జైనుద్దీన్ జన్మస్థలం పట్టాళి. పర్యావరణ రంగంలో ఆయన చేస్తున్న పరిశోధనలు, పర్యావరణ పరిరక్షణకు ఆయన చేస్తున్న కృషికి, విస్తృత ప్రచారానికి గుర్తింపుగా ఆయన జన్మస్థలం పేరును ఈ గ్రహానికి పెట్టారు.

## వింతైన అడ్వాన్స్ బుకింగ్!




**1973** జూన్ 28వ తేదీ క్యూలో నిలబడి గోపాల్ డే అనే పెద్దమనిషి ఒక రైలు టిక్కెట్టు కొన్నాడు. ఎప్పటికో తెలుసా? 2073 జూన్ 28వ తేదీ ప్రయాణం చేయడానికి! కొల్‌కతా, జంషెడ్‌పూర్‌ల మధ్య నడిచే టాటా ఎక్స్‌ప్రెస్‌కు ఆయన ఈ టికెట్ కొన్నాడు. ఆయనకు ఇప్పుడు వయసు అరవైయేళ్ళు. ఆ టికెట్ మీద ప్రయాణం చేయవలసిన నాటికి 125యేళ్ళ వాడవుతాడు. ఆ రోజు తను ఉండడు గనక, ఆ టికెట్టును తను ఉపయోగించాలనుకోవడం లేదు. అందువల్ల దాన్ని తన కూతురికిస్తే, ఆమె కొడుక్కివ్వగలదనీ ఆ రోజు అతడు ప్రయాణం చేయగలడనీ డే ఆశిస్తున్నాడు.

## ఎవరెస్టు సరికొత్త రికార్డులు



ఆస్ట్రేలియా సిడ్నీకి చెందిన చెరిల్ బార్ట్-నిక్కీ అనే తల్లీ కూతుళ్ళు అ. ఎత్తయిన శిఖరాన్ని అధిరోహించి అక్కడ మొదట కాలుమోపిన తొలి తల్లీకూతుళ్ళు అనే రికార్డును సృష్టించారు. మే 24వ తేదీ వాళ్ళు పర్వత శిఖరాన్ని చేరుకున్నారు. మరుసటి రోజు ఉదయం, డెబ్భై అయిదేళ్ళ మిన్ బహదూర్ షెర్చాన్ అతివృద్ధుడైన శిఖరోహకుడయ్యాడు. ఒక వారానికి ముందు అప్పాషెరా పద్దెనిమిదవసారి శిఖరాన్ని చేరుకున్నాడు. తన దేశస్థులు సాధించిన పలు రికార్డులలో తన పేరూ నమోదుకావడం నేపాల్ దేశస్థుడైన షెర్చాన్ ఎంతో గర్వంగా భావిస్తున్నాడు.



# ఇంద్రజిత్తు

రావణాసురుడు అద్భుతమైన తపోశక్తితో బ్రహ్మదేవుణ్ణీ, పరమశివుణ్ణీ మెప్పించినవాడు. వేదాలను ఔపోసన పట్టినవాడు. దిక్పాలకు లను గడగడ లాడించి; బలపరాక్రమాలలో తనకు సాటి రాగల వీరులుగాని; తనకు లేని సంపదలు గాని ముల్లోకాలలో మృగ్యం అని నిరూపించిన లంకాధిపతి ధర్మ మార్గం తప్పి చరించడంతో కడివెడుపాలలో బొట్టు విషం కలిసిన చందాన తోబుట్టువులనూ, కన్న బిడ్డలనూ కళ్ళెదుటే పోగొట్టుకుని విషాద నాయకుడిగా మిగిలి పోయాడు!

అటువంటి రావణబ్రహ్మకూ, పతివ్రతా శిరోమణి మందోదరికీ జ్యేష్ఠ కుమారుడిగా జన్మించిన మేఘనాధుడు-మంచి చేసినా, చెడు చేసినా కన్న తండ్రికి బాసటగా నిలిచాడు. ఆయన మాటను శిరసావహించి శత్రువులతో చివరిదాకా పోరాడి ప్రాణత్యాగం చేసి పితృ భక్తిగల అసమాన వీరకుమారుడుగా పేరు తెచ్చుకున్నాడు.

మేఘనాధుడు మహేశ్వర క్రతువు చేసి పరమేశ్వరుడి కరుణకు పాత్రుడయ్యాడు. అద్భుత శక్తులు సాధించాడు. తండ్రి రావ ణుడు ఇంద్రుడి మీదకు యుద్ధానికి వెళ్ళి నప్పుడు మేఘనాధుడు కూడా ఆయనవెంట వెళ్ళాడు. ఇంద్రుడు రావణుణ్ణి ఓడించి బంధించాడు. అప్పుడు మేఘనాధుడు రాక్షస మాయలతో అదృశ్యంగా యుద్ధంచేసి ఇంద్రుణ్ణి పరాజితుణ్ణి చేసి తండ్రిని విడిపించాడు. ఆ తరవాత ఇంద్రుణ్ణి బంధించి లాక్కు వెళు తూండగా బ్రహ్మదేవుడంతటివాడు వచ్చి బతి మాలి ఇంద్రుణ్ణి విడిపించవలసి వచ్చింది. ఇంద్రుణ్ణి జయించడంవల్ల మేఘనాధుడనే అసలు పేరు మరుగున పడి ఇంద్రజిత్తు అనే సార్థక నామధేయుడయ్యాడు!

**పురాణ వీరకుమారులు - 5**



హనుమంతుడు లంకలో ప్రవేశించి, సీతను చూశాక-కింకరులు, జంబుమాలి, అక్షకుమారుడు మొదలైన రాక్షసవీరులను హతమార్చి నానా బీభత్సం సృష్టించాడు. అప్పుడు ఇంద్రజిత్తు తండ్రి ఆనతి ప్రకారం వెళ్ళి తను వేసే బాణాలు ఒక్కటీ హనుమంతుడికి తగలకపోవడం గ్రహించి, అతడిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించి బంధించి తెచ్చి తండ్రి ఎదుట నిలబెట్టాడు!

సీతను రాముడికి అప్పగించి ఆయనతో మైత్రిచేసుకోవడం మంచిదని విభీషణుడు రావణుడికి హితవు పలికినప్పుడు ఇంద్రజిత్తు ఆక్షేపించాడు. ఆపత్సమయంలో శత్రువులకు భయపడి వారిని ఆశ్రయించడం వీరుల లక్షణం కాదని పినతండ్రిని మందలించాడు.

తీరా రామరావణ యుద్ధం ఆరంభమయింది. వానరులకూ రాక్షసులకూ మధ్య ఘోరయుద్ధం జరుగుతున్నది. ఇంద్రజిత్తు గురూపదేశం పొంది హోమం చేసి, హోమం నుంచి వెలువడిన పసిడిరథంపై యుద్ధరంగానికి బయలుదేరాడు. మొదట ద్వంద్వ యుద్ధంలో అంగదుడితో కలయపడ్డాడు. అంగదుడు తన సారథినీ, గుర్రాలనూ చంపడంతో ఇంద్రజిత్తు మాయమై మాయా యుద్ధానికి పూనుకున్నాడు.

రామలక్ష్మణులిరువురినీ నాగాస్త్రాలతో బంధించి శరీరాల నిండా సందులేకుండా బాణాలతో కొట్టిస్పృహకోల్పోయేలా చేశాడు. వానరులు భయభ్రాంతులై భోరున విలపించసాగారు. ఆఖరికి గరుత్మంతుడు వచ్చి ఝంఝామారుతంతో నాగాలను తొలగించడం వల్ల రామలక్ష్మణులకు స్పృహవచ్చి మామూలు మనుషులయ్యారు.

ఆ తరవాత తోడేలు, సింహ ముఖాల గాడిదల రథం మీద వచ్చిన ధూమ్రాక్షుణ్ణి హనుమంతుడు కొండలాంటి బండను వేసి హతమార్చాడు. ఆపిమ్మట వజ్రదంష్ట్రుణ్ణి అంగదుడు తల నరికి చంపాడు. అకంపనుణ్ణి హనుమంతుడు చెట్టు పీకి చితక్కొట్టి చంపాడు. ప్రహస్తుడనే దానవ వీరుడు భీకరంగా పోరాడి నీలుడి చేతిలో చచ్చాడు.

ఆగ్రహోదగ్రుడై యుద్ధరంగానికి వచ్చిన రావణాసురుడు మొదట హనుమంతుణ్ణి తీవ్రబాణాలతో కొట్టాడు. దాన్ని చూసిన రాముడు రావణుడి రొమ్ముపై పిడుగులాంటి బాణం వేశాడు. అతడి కిరీటాన్ని భగ్నం చేశాడు.



సారథినీ, గుర్రాలనూ చంపి, ''నిరాయుధ పాణిగా నిలిచావు! ఇవాళ వెళ్ళి, ఆయుధాలు ధరించి రేపు యుద్ధానికి, రా!'' అని చెప్పి వదిలిపెట్టాడు.

రావణుడికి గర్వభంగమయింది. అవమాన భారంతో వెనుదిరిగాడు. గాఢనిద్రలో వున్న అనుంగుతమ్ముడూ, మహాబలశాలీ అయిన కుంభకర్ణుణ్ణి లేవగొట్టి పరిస్థితి వివరించాడు. అతడు పర్వతాకారంతో త్రిశూలం చేతబట్టి యుద్ధరంగం ప్రవేశించి అందిన వానరులను అందినట్టు పట్టి తింటూ అల్లకల్లోలం సృష్టించాడు. హనుమంతుడు, సుగ్రీవుడు ఎదుర్కొన్నారు. చావుదెబ్బలు తిన్నారు. ఆఖరికి రాముడు వాయువ్యాస్త్రం, ఇంద్రాస్త్రం ప్రయోగించి చేతులనూ, పాదాలనూ, తలనూ నరికి హతమార్చాడు. ఆ తరవాత వీరులు అతికాయుడు మరో అయిదుగురు వీరులు హతులయ్యారు.

దుఃఖంలో మునిగివున్న రావణుణ్ణి ఓదార్చి ఇంద్రజిత్తు యుద్ధరంగానికి బయలుదేరాడు. యుద్ధరంగంలో చుట్టూ రాక్షసులను కాపలా ఉంచి హోమం చేశాడు. బ్రహ్మాస్త్రం జపించి, ధనుస్సునూ, రథాన్నీ అభిమంత్రించాడు. ఆ తరవాత రథంలో ఆకాశంలోకి అంతర్ధానమయ్యాడు. రామలక్ష్మణులపై బాణవర్షం కురిపించసాగాడు. ఆ బాణవర్షానికి అందరూ మూర్ఛపోయారు. ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం దెబ్బకు లక్ష్మణుడు మూర్ఛ పోయాడు. ఇంద్రజిత్తు పరమానందంతో వెనుదిరిగి వెళ్ళిపోయాడు. ఆ తరవాత జాంబవంతుడి సలహా మేరకు హనుమంతుడు హిమాలయాలకు వెళ్ళి సంజీవని

ఓషధీ పర్వతం తెచ్చి లక్ష్మణుడితో సహా అందరినీ బతికించాడు. రావణుడు-కుంభకర్ణుడి కుమారులైన కుంభనికుంభులను పంపాడు. వారిని సుగ్రీవుడు, హనుమంతుడు హతమార్చారు.

ఎలాగైనా రామలక్ష్మణులను హతమార్చి రమ్మన్న తండ్రి ఆజ్ఞ ప్రకారం ఇంద్రజిత్తు యుద్ధ రంగంలో ప్రవేశించాడు. అదృశ్యంగా ఆకాశం నుంచి రామలక్ష్మణుల మీద బాణ వర్షం కురిపించాడు. శత్రుల ఆత్మస్థైర్యాన్ని దెబ్బ తీసే ఉద్దేశంతో మాయా సీతను సృష్టించి తెచ్చి, హనుమంతుడి ఎదుట హింసించి హతమార్చాడు. హడలిపోయిన వానర వీరులు వెళ్ళి రాముడికి సంగతి చెప్పారు.

సమయానికి అక్కడికి వచ్చిన విభీషణుడు, ''ఇదంతా మాయం. ఇంద్రజిత్తు మాయ చేసి నికుంభిళ చైత్యానికి వెళ్ళి హోమం చేస్తున్నాడు. హోమం పూర్తయితే అతణ్ణి ఎవరూ జయించలేరు. కాబట్టి ముందే వెళ్ళి చంపాలి. అందుకు లక్ష్మణుడే సరైన వాడు,'' అని చెప్పాడు.

లక్ష్మణుడు వానరసేనతో వచ్చాడని తెలియగానే హోమం పూర్తికాకుండానే ఇంద్రజిత్తు లేచి హనుమంతుణ్ణి ఎదుర్కొన్నాడు. లక్ష్మణుణ్ణి బాణప్రయోగం చేయమని విభీషణుడు ప్రేరేపించాడు. దానిని చూసిన ఇంద్రజిత్తు, ''ఈ గడ్డ మీద పుట్టిన నువ్వు నాకెలా ద్రోహం తలపెట్టావు? మానాభిమానాలు లేకుండా శత్రువుల వద్ద నీచుడిగా బతకడం సిగ్గులేని కులద్రోహీ!'' అని నిందించాడు.

ఆ తరవాత లక్ష్మణుడిపై బాణాలు ప్రయోగించి సింహనాదం చేశాడు. చాలా సేపు ఇద్దరూ సమంగా పోరాడారు. విభీషణుడు కూడా లక్ష్మణుడికి తోడుగా యుద్ధం చేశాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు సారథిని చంపాడు. వానరవీరులు అశ్వాలను చంపారు. ఇంద్రజిత్తు క్షణంలో కొత్త రథంలో ప్రత్యక్షమయ్యాడు. విభీషణుడు అతడి రథాశ్వాలను చంపాడు. ఇంద్రజిత్తు నేల మీదికి దూకి లక్ష్మణుడిపై దివ్యాస్త్రాలు ప్రయోగించాడు. ఆఖరికి లక్ష్మణుడు ఒక దివ్యాస్త్రంతో ఇంద్రజిత్తు శిరస్సును ఖండించాడు.








## అన్నమయ్య విగ్రహావిష్కరణ

పదకవితా పితామహుడు అన్నమాచార్యుల 600వ జన్మదినాన్ని పురస్కరించుకుని ఆయన జన్మస్థలమైన తాళ్ళపాకలో 108 అడుగుల ఎత్తయిన అన్నమయ్య విగ్రహం ఇటీవల ఆవిష్కరించ బడింది. 1408వ సం.లో జన్మించి 95 ఏళ్ళు జీవించిన అన్నమయ్య ఏడుకొండల తిరుపతి వేంకటేశ్వర స్వామి మీద 32,000లకు పైగా సుమధుర భక్తి కీర్తనలు రచించాడు. ఆయన కీర్తనలు ఆంధ్ర సాహిత్యాన్ని పరిపుష్ఠం చేశాయి. విగ్రహావిష్కరణ సందర్భంగా అసంఖ్యాక భక్తజన సందోహంతోపాటు వెయ్యి మందికిపైగా కళాకారులు 'నగర సంకీర్తన యాత్ర'లో పాల్గొన్నారు.

## ఇదీ మనదేశంలోనే

తమిళనాడు చిదంబరం సమీపంలోని కిళ్ళయ్ గ్రామానికి చెందిన ఎం. బషీరీబాయి పదేళ్ళ క్రితం ఒక కల కన్నది. ఆ కలలో ఒక దివ్యస్త్రీ కనిపించి, ''నువ్వు, నీ భర్త మహమ్మద్ జిన్నా శ్రీమారి యమ్మకు ఒక ఆలయం నిర్మించండి,'' అని ఆదేశించిందట!



ఆమె జ్యోతిష్కులను, పండితులను సంప్రదించింది. దివ్య సందేశాన్ని నెరవేర్చమని వాళ్ళు సలహా ఇవ్వడంతో ఆ దంప తులు గుడి నిర్మాణానికి పూనుకున్నారు. పంచలోహాలతో ఐదడుగుల అమ్మవారి విగ్రహాన్ని తయారు చేసి ప్రతిష్ఠించారు. కుంభాభిషేకం తరవాత నిత్యపూజలు ప్రారంభమయ్యాయి. బషీరీబాయి (48) ఆచారసంప్రదాయాలను ఎరిగిన పూజా రుల నుంచి పూజావిధానాలను నేర్చుకుని పూజలు నిర్వర్తించ డానికి ఆమె భర్త జిన్నా అనుమతించాడు.



శ్రీ సి. రాధాకృష్ణన్ సాహిత్యంలోని వివిధ శాఖలలో అరవై గ్రంథాలకు పైగా మలయాళ భాషలో రచించారు. ఆయన కొన్ని మలయాళ అనువాదాలను, ఆంగ్ల అనువాద గ్రంథాలను కూడా వెలయించారు. భౌతిక శాస్త్రంలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ అయిన రాధాకృష్ణన్ సైన్స్ గురించి అనేక పుస్తకాలు రాశారు. దాదాపు ఇరవై సాహిత్య బహుమతులు అందుకున్న రాధాకృష్ణన్ కేంద్రసాహిత్య అకాడెమీ, కేరళసాహిత్య అకాడెమీ అవార్డులతో సత్కరించబడ్డారు.

# పునర్వసు నక్షత్రం

**మా** తాతయ్య నాకు చాలా కథలు చెప్పేవారు. వాటిలో నాకు బాగా నచ్చిన కథ ఒకటి తరచూ జ్ఞాపకం వస్తూ ఉంటుంది.

గుణాకరుడనే గొప్ప రాజు ఉండేవాడు. ఆయన దయగల పాలకుడు కావడంతో ప్రజలు సంతోషంగా జీవించేవారు. రాజ్యంలోని ప్రతి ఒక్కరికీ కోరినవన్నీ లభించేవి ఒక్క కలలు తప్ప. ఒకానొక ముని శాపం కారణంగా ఆ రాజ్య ప్రజలకు కలలు అంటే ఏమిటో కూడా తెలియకుండా పోయింది.

గుణాకరుడి ముత్తాత దినకరుడి పాలనా కాలంలో ఆ ముని ఆ రాజ్యానికి వచ్చాడు. దినకరుడు తరచూ కలలలో తేలియాడేవాడు. ముని మాట్లాడుతున్నప్పుడు అతడేదో పగటి కలలోకి వెళ్ళిపోయాడు. అంతటి నిర్లక్ష్యమా అని ఆగ్రహం చెందిన ముని రాజ్యంలోని వారందరికీ కలలుగనే శక్తి నశించాలని శపించాడు! ఆ తరవాత అదొక సమస్యగా పరిణమించింది. కళలు, విజ్ఞానం అభివృద్ధి చెందలేకపోయాయి. రెండూ కూడా నిజమయ్యే కలలే కదా. మొదట కలగనకుండా ఎవరూ చిత్రలేఖనం చేయలేరు. ఒక వంతెన ఎలా ఉండాలి అని మనసులో మొదట కలగనకుండా వాస్తవ ప్రపంచంలో నిర్మించలేరు కదా? మొదట మనసులో రూపొందలేదంటే కథలను ఎవరూ చెప్పలేరు.

గుణాకరుడు కలలంటే ఏమిటో తెలియని వాడుగానే పెరిగి పెద్దవాడయ్యాడు. పొరుగు రాజ్యపు యువరాణి భావనాదేవిని వివాహమాడేంతవరకు ఆయన రాజ్యం సరిహద్దులు దాటి ఎరుగడు. ఆమె వివాహం కోసం ఆయన రాజ్యం దాటి బయట అడుగు పెట్టగానే ఆయన మనసులో అందమైన కలలు కదలాడసాగాయి. అదో అపూర్వ అద్భుత అనుభవం. అయితే తమ రాజ్యానికి తిరిగి రాగానే రాజ దంపతులు కలలు గనే శక్తిని కోల్పోయారు. రాజుకు ఇది అలవాటే గనక, పెద్దగా బాధపడలేదు. అయితే రాణి భావనాదేవి మాత్రం నష్టాన్ని తలుచుకుని తీవ్ర ఆందోళనకు గురయింది.

ఇరువురూ కలిసి రాజ్యంలోకి మళ్ళీ కలలను తీసుకురావడం ఎలాగా అని తీవ్రంగా ఆలోచించసాగారు. ఆ ఆలోచన కూడా ఒక



ఉండక తప్పదు. వాళ్ళకు కలలు కనే వయసురాగానే, మీ రాజ్య ప్రజల కలలను దాచి పెట్టిన పునర్వసు నక్షత్రం వద్దకు వెళ్ళి, వాటిని మళ్ళీ తీసుకురాగలరు,'' అన్నాడు.

రాజదంపతులు తమ రాజ్యానికి తిరుగు ప్రయాణమయ్యారు. వారు తమ రాజ్య సరిహద్దులో అడుగు పెట్టగానే, తమ కలలను రాసిపెట్టిన తాళపత్రాలలోని అక్షరాలన్నీ మాయమై పోయాయి. అయితే ముని ఇచ్చిన హామీ మాత్రం జ్ఞాపకం ఉండడంతో, ఓర్పుగా ఎదురుచూడసాగారు.

విధమైన కలే గనక, ఎంత ప్రయత్నించినా ఆ తరవాత ముందుకు సాగలేక పోయారు. అందువల్ల కొంతకాలం రాజ్యం వెలుపల గడపాలని నిర్ణయించారు. రాజ్య సరిహద్దులు దాటగానే, వాళ్ళు హాయిగా కలలుగనసాగారు. ఒక వటవృక్షం కింద కూర్చుని రకరకాల చర్యల గురించి ఆలోచించారు. ఆఖరికి శాప మిచ్చిన ఆ మునినే దర్శించాలని నిర్ణయించారు.

ఆ ముని మరణం అంటూ లేని చిరంజీవి. నిత్య సంచారి. అందువల్ల రాజదంపతులకు ఆయన్ను కలుసుకోవడానికి చాలా రోజులు పట్టింది. అలా వెళ్ళినప్పుడు తమకు వచ్చిన కలలను తాళపత్రాలలో రాసుకుంటూ వెళ్ళారు.

ముని వారిని ఎంతో కనికరంతో పరామర్శించాడు. రాజు చూపిన స్వల్పమైన అశ్రద్ధకు ప్రజలందరినీ శిక్షించినందుకు ఆయనలో అప్పటికే పశ్చాత్తాపం మొదలయింది. రాజదంపతుల మొరను ఆలకించిన ముని, ''మీకు ఇద్దరు సంతానం కలిగేంతవరకు మీరు వేచి

మొదట రాజదంపతులకు ఒక కుమారుడు, రెండేళ్ళ తరవాత ఒక కుమార్తె జన్మించారు. వారికి మేధ, ప్రతిభ అని పేర్లు పెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగారు. ముని రాజభవనానికి స్వయంగా వచ్చి వారికి అక్షరాభ్యాసం చేయించాడు. ఆ సందర్భంగా వారిని ధరించమని చెరొక వజ్రాన్ని బహూకరించాడు. ఆ మాయావజ్రాలు పిల్లలకు కలలుగనే శక్తిని ప్రసాదించాయి. అందువల్ల వాళ్ళు గురువులను రకరకాల ప్రశ్నలు అడగసాగారు. గురువులకు ఊహాశక్తి కొరవడడంతో పిల్లల ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పలేక సతమతమయ్యేవారు.

పిల్లల సాధారణ విద్య పూర్తయింది. రాజు వారిని సభకు తీసుకువచ్చి, తమ రాజ్యంలోని ప్రజలు కలలుగనే శక్తిని కోల్పోయిన కారణాన్నీ; శాపవిముక్తి పొంది దానిని మళ్ళీ సంపాయించేందుకు తానూ, రాణీ చేస్తున్న ప్రయత్నాలనూ వివరించాడు. ఆ తరవాత కొడుకునూ, కుమార్తెనూ ఆప్యాయంగా కౌగి

లించుకుని, ''ఆ శాపవిముక్తి కలిగించే శక్తి మీ ఇద్దరికే ఉన్నది,'' అన్నాడు.

తండ్రి మాటలు విస్మయం కలిగించినప్పటికీ, అందుకు తమ శాయశక్తులా కృషి చేయగలమని అన్నాచెల్లెళ్ళు మాట ఇచ్చారు. తాము పునర్వసు నక్షత్రాన్ని చేరుకోవాలి. రాజ్య సరిహద్దుల్లో పర్వతశిఖరానికి ఆనుకుని పునర్వసు నక్షత్రం కనిపించేది. ఆ పర్వతాన్ని అధిరోహించి నక్షత్రాన్ని చేరుకోవాలని మేధ, ప్రతిభ నిర్ణయించారు.

వాళ్ళు తమ పథకాన్ని తెలియజేయగానే, అంతపెద్ద కొండను ఎక్కడం పిల్లలకు అసాధ్యం అని రాజదంపతులు శంకించారు.

సుదీర్ఘ ఆలోచనలు, తర్జన భర్జనల తరవాత రాజదంపతులు పిల్లల ప్రతిపాదనకు సమ్మతించారు. వాళ్ళకు రక్షణగా వాళ్ళ వెంట కొందరు భటులను పంపాడు రాజు. తాము మాత్రమే నక్షత్రం దగ్గరికి వెళ్ళాలి గనక, భటులను కొండ పాదతలంలోనే ఆపి, పిల్లలు మాత్రం కొండ ఎక్కసాగారు. అతి కష్టమైన ఆరు రోజుల పయనం తరవాత అన్నాచెల్లెళ్ళు కొండ శిఖరాన్ని చేరుకోగలిగారు. అయితే, నక్షత్రం మైదానం నుంచి చూసినప్పుడు కనిపించినంత దూరంలోనే ఇప్పుడూ కనిపించడంతో ఆశాభంగానికి లోనయ్యారు. విచారంతో వెనక్కు తిరిగారు.

రాజభవనానికి తిరిగి వెళ్ళి నక్షత్రం గురించి తెలుసుకున్న విషయాన్ని తండ్రికి చెప్పారు. రాజు పండితులను పిలిపించి తరవాత చేపట్టవలసిన కర్తవ్యం గురించి చర్చించాడు. పండితులు తాము కుబేరుణ్ణి గురించీ, ఆయనకున్న పుష్పక విమానం గురించీ చెప్పారు. ''యాగం ద్వారా కుబేరుణ్ణి ప్రసన్నం చేసుకున్నట్టయితే, ఆయన దివ్య వాహనమైన పుష్పకాన్ని మన యువరాజుకు, యువరాణికి ప్రసాదించమని ప్రార్థించవచ్చు. పుష్పకం ఎక్కి వాళ్ళు నక్షత్రం వద్దకు వెళ్ళిరావచ్చు,'' అని ఒక దైవజ్ఞుడు సలహా ఇచ్చాడు.

రాజగురువు ఆధ్వర్యంలో యాగం ప్రారంభమయింది. హోమానికి వెయ్యి కుండల ఆవు నెయ్యిని ఉపయోగించారు. వెయ్యి గోవులు, వెయ్యి బంగారు నాణాలు బ్రాహ్మణులకు దానంగా ఇచ్చారు. నెల రోజులపాటు పురోహితులు నిర్విఘ్నంగా వేద మంత్రాలు వల్లించారు. చివరి రోజు యజ్ఞకుండం మంటల నుంచి వెలుపలికి వచ్చిన కుబేరుడు మేధ, ప్రతిభలను ఆశీర్వదించాడు. వాళ్ళిద్దరూ



మాత్రమే కుబేరుడి దివ్యరూపాన్ని చూడగలి గారు. పుష్పకవిమానం స్వర్గ, మర్త్య, పాతాళ లోకాల మధ్య మాత్రమే పయనిస్తుందని, అది ఏ నక్షత్రం దగ్గరికీ వెళ్ళ జాలదనీ కుబేరుడు చెప్పాడు.

''మరి మేము పునర్వసు నక్షత్రం వద్దకు వెళ్ళి మా ప్రజల కలలను విడిపించుకుని రావాలి. అది ఎలా సాధ్యం?'' అని అడిగారు మేధ, ప్రతిభ.

''సూర్య చంద్రులు, నక్షత్రాలతో సహా విశ్వరహస్యాలను ఎరిగిన వ్యాసమహర్షిని సంప్రదించండి. ఆయన తగిన సలహా ఇవ్వ గలడు,'' అని చెప్పాడు కుబేరుడు.

''ఆ మహర్షి ఎక్కడ ఉంటాడు?'' అని అడిగాడు మేధ.

మహర్షి రూపాన్ని పూర్తిగా వివరించి కుబే రుడు అదృశ్యమయ్యాడు.

రాజకుమారుడు, కుమారి తమ వద్దవున్న వజ్రాల సాయంతో వ్యాసమహర్షి రూపాన్ని మన సులో నిలిపి కొన్ని రోజుల పాటు ప్రార్థనలతో గడిపారు. మహర్షి వాళ్ళ మనోనేత్రాల ముందు ప్రత్యక్షమయ్యాడు. ''పునర్వసు నక్షత్రాన్ని చేరే మార్గం తెలియజేయండి, మహాత్మా!'' అని ప్రార్థించారు అన్నాచెల్లెలు.

మహర్షి మందహాసం చేసి, ''మీరు పయనం చేపట్టడానికి ముందు రెండు ఆకాశాలు ఉన్నా యని అర్థంచేసుకోవాలి,'' అన్నాడు.

''అవి ఏవి మహర్షీ?'' అని అడిగారు అన్నాచెల్లెలు ముక్తకంఠంతో.

''మొదటిది పైనున్న ఆకాశం. అది బహి రాకాశం. రెండవది చిదాకాశం. అది మీ చిత్తులో అంటే మనసులో ఉన్న ఆకాశం. మీ మన



సులో ఉన్నదాని ప్రతిబింబమే వెలుపల కని పించేది. అందువల్ల ఇప్పటికే మీలో పునర్వసు ఉన్నది,'' అన్నాడు మహర్షి.

''మహర్షీ! సూర్యచంద్రులు కూడా మాలోనే ఉన్నారా? సెలవివ్వండి,'' అని అడిగారు అన్నాచెల్లెలు.

''అందులో సందేహం దేనికి? మీ కలలను, తక్కిన అందరి కలలను నక్షత్రంలో వెదికి విడుదల చేయండి,'' అని చెప్పి వ్యాసమహర్షి అదృశ్యమయ్యాడు.

ఆ తరవాత వాళ్ళ అన్వేషణ చాలా రోజుల పాటు సాగింది. ఆఖరికి తమ తండ్రీ, తల్లీ, రాజ్యంలోని ప్రజలందరూ కూడా కలలు కనే విధంగా ఏకాగ్రతతో ధ్యానించారు.

మేధ మేధాశక్తికీ, ప్రతిభ ఊహాశక్తికీ సంకే తాలని రాజ్యప్రజలు గ్రహించారు.

## మధ్యప్రదేశ్ జానపద కథ

# పురోహితుడి జోస్యం

మోర్వా అనే గ్రామంలో జ్ఞానసంపన్నుడూ, కరుణాస్వభావుడూ అయిన ఒక వృద్ధ పురోహితుడు ఉండేవాడు. గ్రామస్థులు ఆయన పట్ల ఎంతో గౌరవాదరాలతో మెలిగేవారు. ఎవరింట్లో ఏ శుభకార్యం జరిగినా ఆయన్ను ఆహ్వానించేవారు. తమ కుటుంబాలలో జరిగే పెళ్ళిళ్ళు, గృహప్రవేశాలు మొదలైన వాటికి ఆయన చేతే ముహూర్తాలు పెట్టించుకునేవారు. పురోహితుడి మంచి స్వభావం గ్రహించి ఆయన సలహాల కోసం ఇరుగు పొరుగు గ్రామాల నుంచి కూడా ప్రజలు వస్తూండేవారు.

రోజులు గడిచే కొద్దీ వృద్ధ పురోహితుడు మునుపటిలా పిలిచిన వారి వెంట పొరుగూళ్ళకు వెళ్ళలేక పోయాడు. వయసు పైబడుతున్నదని ఆయన గ్రహించాడు. మోర్వాలో జరిగే శుభకార్యాలకు మాత్రం తను హాజరవుతూ ఇరుగుపొరుగు గ్రామ ప్రజలను నిరాశ పరచకుండా తన కొడుకు ఓంకార్‌కు అక్కడి పనులను అప్పగించాలని నిర్ణయించాడు.

అలా వెళ్ళినప్పుడల్లా యువకుడైన ఓంకార్ తండ్రికి తెలియకుండా, పిలిచిన గృహస్థుల నుంచి డబ్బులు పుచ్చుకోవడం ప్రారంభించాడు. గ్రామస్థులు దీనిని మొదట అంతగా పట్టించుకోలేదుకాని, అతడు పనులు నిర్వర్తించడానికి ముందే డబ్బులివ్వమని పీడించడంతో దిగ్భ్రాంతితో ఆలోచనలో పడ్డారు. అతడి తండ్రి మీది గౌరవం కొద్దీ అతణ్ణి ఏమీ అనలేక ఊరుకున్నారు. అయితే, క్రమక్రమంగా అతణ్ణి సంప్రదించడం, పిలవడం, శుభలగ్నాలు పెట్టమని అడగడం మానుకున్నారు.

మరి కొన్నాళ్ళకు వృద్ధ పురోహితుడు కాలధర్మం చెందడంతో, మార్వా గ్రామస్థులకు అవసరమైనప్పుడు ఓంకార్‌ను పిలవక తప్పడం లేదు.

ఇలా ఉండగా మోర్వా గ్రామానికి చెందిన రాహుల్ అనే యువకుడు పొరుగు గ్రామంలోని మాధవి అనే యువతిని ప్రేమిం





చాడు. మాధవి పేదింటి పిల్ల. ఆమె కన్నవాళ్ళు పెళ్ళికి ఒప్పుకున్నప్పటికీ, పెళ్ళి ఆడంబరంగా జరిపించలేమని రాహుల్‌తో చెప్పారు. పురోహితుడు లేకుండానే పెళ్ళి జరిపిస్తామన్నారు.

ఆ కారణం వల్ల తన పెళ్ళి గురించి రాహుల్ పురోహితుడు ఓంకార్‌కు చెప్పలేదు. పెళ్ళికి ఆహ్వానించనూ లేదు. దాన్ని ఓంకార్ తీరని అవమానంగా భావించాడు.

పెళ్ళి కూతురి ఇంట జరిగిన మూడు రోజుల పెళ్ళితంతు పూర్తయ్యాక, రాహుల్ మాధవిని తమ గ్రామానికి వెంటబెట్టుకు వచ్చాడు. రాహుల్ తండ్రి గ్రామస్థులకు విందు పెట్టాలనుకున్నాడు. పెళ్ళికి రాని గ్రామస్థులు ఇప్పుడు వచ్చి తమ కొడుకునూ కోడలినీ ఆశీర్వదించగలరన్న ఉద్దేశంతో రాహుల్ తండ్రి గ్రామస్థులకు విందు ఏర్పాటు చేశాడు. అందరిని పిలిచినట్టే పురోహితుడు ఓంకార్‌ను కూడా ఆహ్వానించాడు. పురోహితుడు వస్తానన్నాడు గాని తనను పెళ్ళికి పిలవలేదన్న అక్కసును వెళ్ళగక్కాడు.

అది పెళ్ళికూతురి తండ్రి జరిపిన పెళ్ళి అనీ, ఖర్చులకు భయపడి వాళ్ళు పురోహితుణ్ణి పిలవలేదనీ రాహుల్ తండ్రి ఓంకార్‌కు క్షమాపణలు చెప్పాడు. ఓంకార్ చిన్నగా నవ్వుతూ మౌనం వహించాడు. రాహుల్ తండ్రి అతడి మనసులోని దురాలోచనలను గ్రహించలేక, శాంతించాడని సంతోషంగా వెళ్ళిపోయాడు. విందు ఏర్పాట్లు చక్కగా జరిగాయి. పెద్దలందరూ నూతన వధూవరులను ఆశీర్వదించారు. ఆటపాటలతో ఇల్లు కళకళలాడుతోంది. పురోహితుడు రాగానే ఆయనకు గౌరవంగా స్వాగతం పలికారు. నూతన వధూవరులు ఆశీస్సుల కోసం ఆయన ఎదుట వినయంగా వంగి కూర్చున్నారు. పురోహితుడి చూపులు అందమైన పెళ్ళికూతురు మీద పడ్డాయి. మరుక్షణమే అతడు, ''ఆమె దుష్టశక్తి! వెంటనే ఇక్కడి నుంచి గెంటేయండి. లేకుంటే మీరే ఇల్లు వదిలిపెట్టవలసి వస్తుంది,'' అని కోపంగా హెచ్చరించి ఇంటి నుంచి విసురుగా వెలుపలికి నడిచాడు.

దిగ్భ్రాంతి చెందిన రాహుల్ తల్లిదండ్రులు చేతులు జోడించి, ''మమ్మల్ని క్షమించండి,'' అంటూ పురోహితుడి వద్దకు వెళ్ళారు. అతడు వెనుదిరిగి చూస్తూ, ''అసలు ఈ ముదనష్టపు పెళ్ళి జరిగి ఉండకూడదు. మీరు నన్ను సంప్రదించి ఉంటే నేను అప్పుడే వద్దని వారించి ఉండేవాణ్ణి. ఆ అమ్మాయిని ఎంత తొందరగా వదిలించుకుంటే మీ అబ్బాయికీ, కుటుంబా

నికీ అంత మంచిది. ఆమె ఇక్కడ ఉన్నదో కుటుంబం సర్వనాశనం కాక తప్పదు. జాగ్రత్త!'' అని హెచ్చరించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

రాహుల్ తల్లిదండ్రులకు ఏం చెయ్యడానికీ దిక్కు తోచలేదు. పురోహితుడి మాట విని అభంశుభం ఎరుగని అమాయకురాలైన కోడలిని ఇంటి నుంచి ఎలా పంపగలం అనుకుంటూ లోపలికి వెళ్ళారు. మాధవి మౌనంగా విలపిస్తోంది. ఆమెను మెల్లగా ఓదార్చి, జరిగిన సంగతి బయట పొక్కకుండా గాంభీర్యం వహించారు అత్తమామలు. విందుకు వచ్చిన గ్రామస్థులు ఎవరూ అదృష్టవశాత్తు పురోహితుడి హెచ్చరికను వినలేదు. రాహుల్ తల్లిదండ్రులు అయన వెనక వెళ్ళినప్పుడు గౌరవంగా సాగనంపడానికి వెళ్ళారని వాళ్ళు భావించారు.

మరునాడు తెల్లవారగానే పురోహితుడి మాటల్లోని నిజానిజాలు తేలేంతవరకు మాధవి పుట్టింటికి తిరిగివెళ్ళి అక్కడే గడిపివస్తానని చెబుతోందనీ, తనే వెళ్ళి ఆమెను పుట్టింట వదిలి వస్తానీ రాహుల్ తన తల్లిదండ్రులకు చెప్పాడు. అతడి తల్లిదండ్రులు అందుకు ఒప్పుకోలేదు. కోడలి వెంట తామే వెళ్ళివస్తామని చెప్పారు.

అదే విధంగా వాళ్ళు కోడలిని వెంటబెట్టుకుని బయలుదేరారు. ఇక్కడ జరిగినవేవీ తల్లిదండ్రులకు చెప్పవద్దనీ; పురోహితుడి మాటల్లో తమకు ఏమాత్రం నమ్మకం లేదనీ, రాహుల్ త్వరలో వచ్చి ఆమెను తమ ఇంటికి తీసుకురాగలడనీ మార్గమధ్యంలో కోడలికి నచ్చజెప్పారు.

మాధవికి ఇంటి బెంగ పట్టుకోవడంతో అత్తమామలను వెంటబెట్టుకుని తమను చూడడానికి వచ్చి ఉంటుందని ఆమె తల్లిదండ్రులు అనుకున్నారు. ఆ తరవాత కొంత సేపటికి పెళ్ళికి ఆహ్వానించ లేదన్న ఆగ్రహంతో తమ పురోహితుడు ఓంకార్ నూతన దంపతులను ఆశీర్వదించడానికి నిరాకరించి వెళ్ళిపోయిన వైనం గురించి రాహుల్ తల్లిదండ్రులు వియ్యంకులకు నెమ్మదిగా తెలియజేశారు.

ఆ మాట వినగానే మాధవి తల్లిదండ్రులు బిగ్గరగా నవ్వుతూ, ''అయన ఎంతటి అల్పబుద్ధి కలవాడో చూడండి! మా కూతురి పెళ్ళికి మేము ఆయన్ను ఆహ్వానించలేదు. మా గ్రామస్థులందరూ ఆయన్ను బహిష్కరించడం మూలాన మేమూ పిలవలేకపోయాం. ఆయన తండ్రిలా కాదు. ఆయనకు మహాపేరాశ. ప్రతి దానికీ





డబ్బులు డబ్బులు అని పేదలను పీడిస్తాడు. అందువల్ల గ్రామస్థులెవరూ పిలవడం లేదు; దాదాపు బహిష్కరించారు గనక మేమూ పిలవ లేక పోయాం. ఆయన తండ్రి కావలసినంత కూడబెట్టి వెళ్ళాడు. ఆ మహానుభావుడు అందించిన సేవలకు దమ్మిడీ పుచ్చుకునేవాడు కాడు. పేదల పట్ల ఎంతో కనికరం చూపేవాడు. కన్న తండ్రి పేరు చెరపడానికి పుట్టినవాడిలా ఈయన ప్రవర్తిస్తున్నాడు. మా కూతురినీ, అల్లుణ్ణీ అశీర్వదించడానికి నిరాకరించాడని బాధపడడం లేదు. మాధవికి మంచి వరుడు లభించాడు. కన్న కూతురిలా చూసుకునే అత్తమామలైన మీ ఆశీస్సులుంటే చాలు మా కూతురికి. రెండు మూడు రోజుల తరవాత మాధవిని మేమే వెంట బెట్టుకు వస్తాము. నిశ్చింతగా వెళ్ళిరండి,'' అన్నారు.

రాహుల్ తల్లిదండ్రులు ప్రశాంతంగా ఊపిరి పీల్చుకున్నారు. పురోహితుడి గురించి మాధవి తల్లిదండ్రులు బయటపెట్టిన అసలు సంగతి తెలుసుకుని రాహుల్ సంతోషించాడు. అంతే కాదు, ఆపాటికే మోర్బా గ్రామస్థులు కూడా ఓంకార్ తండ్రికి తగిన వారసుడు కాడనీ, ఒక పురోహితుడికి ఉండవలసిన ఆచార సంప్రదాయాల పరిజ్ఞానం, శాస్త్రజ్ఞానం, పరులహితం కోరే బుద్ధి ఆయనలో కంటి కలికానికి కూడా లేవని గ్రహించారు. ఆయన తండ్రి మీద ఉన్న గౌరవం కొద్దీ ఇన్నాళ్ళు ఓంకార్‌ను భరిస్తూ వచ్చారు. రోజు రోజుకూ ఆయన ఆగడాలు పెరిగి పోవడంతో ఇక ఆయన్ను ఊరి నుంచి తరిమేయాలన్న నిర్ణయానికి వచ్చారు.

రాహుల్ కొందరు గ్రామపెద్దలను వెంటబెట్టుకుని ఓంకార్ ఇంటికి వెళ్ళాడు. కాని ఇంట్లో ఒక్కరూ కనిపించలేదు. ఖాళీగా కనిపించింది. తనకు జరగగున్నదాన్నే పురోహితుడు ముందుగా ఊహించి చెప్పాడేమోనని చెప్పుకుని గ్రామస్థులు నవ్వుకున్నారు.

## చందమామ క్విజ్-7 (ఆగస్ట్ 2008) సమాధానాలు

1. అక్బర్ 2. ఢిల్లీ సుల్తాన్ షేర్షా సూరి, 1542లో 3. 1862లో 4. 1950 జనవరి 26 5. నాలగవ విలియం 6. 1774లో. రెండు అణాలు 7. 1852 'సిందే డాక్' (అది సింధ్ ప్రాంతంలో ఉపయోగించడానికి ఉద్దేశించబడడం వల్ల) 8. 1854 సెప్టెంబర్‌లో; అర్ధణా.

## మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (34)

# న్యాయమూర్తిగా ఓ మేధావి



**బం**కించంద్ర చటోపాధ్యాయను గురించి విననివారెవరైనా ఉంటారా? ఈ ప్రశ్న వినగానే పేరువిన్నట్టే ఉంది సమయానికి గుర్తురావడం లేదే అని ఇబ్బందికరంగా ఆలోచించేవారికి అడగబోయే తరవాతి ప్రశ్న సమాధానాన్ని తెలియజేస్తుంది. అజరామరమైన 'వందేమాతరం' గీతాన్ని ఎవరు రచించారు?

కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ప్రప్రథమంగా పట్టభద్రులైన ఇద్దరు విద్యార్థులలో ఒకరు బంకించంద్ర (1838-1894). ఆ రోజుల్లో భారతీయులు అరుదుగా నిర్వహించిన డెప్యూటీ మేజిస్ట్రేట్ పదవిని ఆయన అలంకరించాడు. నిజాయితీ పరుడూ, సమర్థుడూ అయిన పాలనాదక్షుడిగా బంకించంద్రకు మంచి పేరు ఉండేది. న్యాయంగా ఆయన్ను ఉన్నత పదవులకు పదోన్నతి చేయవలసి ఉండేది. అయితే, బ్రిటిష్ పాలకులు ఆయన్ను చూసి భయపడ్డారు. ఎంతటి పలుకుబడి కలవారైనా సరే ఆంగ్లేయులు దోషులుగా నిరూపించ బడినప్పుడు వారిని కఠినంగా శిక్షించకుండా ఆయన వదిలి పెట్టేవాడు కాడు. ప్రభుత్వ పదవిలో ఉన్నాడేగాని, ఆయన లోలోపల జాతీయవాది అని బ్రిటిష్ వాళ్ళు అనుమానించారు. ఆయన తన బాధ్యతానిర్వహణపట్ల విశ్వాసపాత్రుడిగా మసలుకున్నాడే తప్ప బ్రిటిష్ పాలనను ప్రేమించ లేదు.

న్యాయమూర్తిగా ఆయన ఎన్నో క్లిష్టమైన వ్యాజ్యాలను చాలా తెలివిగా, న్యాయం తప్పకుండా, నిష్పక్షపాతంగా పరిష్కరించాడు. ఒక నిరపరాధికి శిక్ష తప్పదనుకున్న తరుణంలో ఆయన పూనుకుని తెలివిగా దోషిని బయట పెట్టిన ఒక ఆసక్తికరమైన ఉదంతం గురించి ఇప్పుడు తెలుసుకుందాం:



ఒక యువకుడు దూర ప్రయాణం చేస్తూ మార్గమధ్యంలో ఒక జమీందారు భవనం ముంగిట రాత్రి గడపడానికి అనుమతి పొంది పడుకున్నాడు. అర్ధరాత్రి సమయంలో యువకుడికి మెలకువ వచ్చింది. పెద్ద మూటతో ఒక ఆకారం పెరటి తలుపు తెరుచుకుని వెళుతూండడం గమనించాడు. అతడు ఒక్క గెంతున వెళ్ళి దొంగను అడ్డుకున్నాడు. మూటను అక్కడే పడేసి యువకుడి పట్టు విడిపించుకుని పారిపోవడానికి దొంగ పెనుగులాడాడు. అయితే సాధ్య పడలేదు. ఉన్నట్టుండి దొంగ తనను పట్టుకున్న యువకుణ్ణి ఒడిసి పట్టుకుని, ''దొంగ! దొంగ!'' అని కేకలు పెట్టాడు.

లాంతర్లతో అక్కడికి పరిగెత్తుకు వచ్చిన చుట్టుపక్కల వాళ్ళు ఇద్దరినీ విడదీసి, పట్టుకున్నారు. జరిగిందేమిటో యువకుడు చెప్పేలోగా దొంగ పైన కప్పుకున్న శాలువాను దూరంగా గిరవాటు వేశాడు. అతడు పోలీసు యూనిఫారంలో కనిపించడమేగాక, జమీందారు ఇంటి నుంచి దొంగిలించి పారిపోతూన్న ఆ యువకుణ్ణి పట్టుకున్నానని వారితో చెప్పాడు. యువకుడు కూడా ఏం జరిగిందో వివరించాడు.

యువకుడు చెబుతున్నదే నిజంలాగా కనిపించినప్పటికీ, అసలు ఏం జరిగి ఉంటుందో గ్రామస్థులకు తెలియలేదు. ఒకవైపు పోలీసు ఉద్యోగి, మరొక వైపు ముక్కూ మొహం తెలియని యువకుడు. ఎవరి మాట నమ్మగలరు పాపం!

ఈ వ్యాజ్యం బంకించంద్ర న్యాయస్థానానికి వచ్చింది. ఆ రాత్రి, ఆ గ్రామానికి బాధ్యతలు నిర్వహించడానికి వెళ్ళే అవకాశం పోలీసుకు లేకపోయినప్పటికీ, ఆయన వెళ్ళినప్పుడు ఇది యాదృచ్ఛికంగా జరిగిందనీ, పోలీసు బాధ్యతా నిర్వహణకు మెచ్చుకోవాలని ఆయన తరఫు న్యాయవాది వాదించాడు. జ్యూరీ సభ్యులు కూడా ఆ వాదంవైపే మొగ్గు చూపడంతో, పోలీసును గౌరవంగా విడుదల చేసే స్థితి ఏర్పడింది. అయితే, బంకించంద్రకు పోలీసు తరఫు వాదం పట్ల అనుమానం కలిగింది.

న్యాయస్థానంలో వాదోపవాదాలు జరుగుతూండగా-మేజిస్ట్రేట్ జవాను హడావుడిగా వచ్చి కోర్టు గుమాస్తా బ్రజ్‌గోపాల్ హత్యకు గురయ్యాడనీ, అతడి మృతదేహం దూరంలో వంతెన కింద పడి ఉన్నదనీ చెప్పాడు.

''శవాన్ని వెంటనే ఇక్కడికి తీసుకురావడానికి ఏర్పాటు చేయండి,'' అని ఆజ్ఞాపించాడు మేజిస్ట్రేట్.

''శవవాహకులు ఎవరూ లేరు. పండుగ సందర్భంగా అందరూ వెళ్ళి పోయారు,'' అన్నాడు జవాను.

''ఫరవాలేదు. విచారణలో ఉన్న ఈ ఇద్దరు ఖైదీలు నా ఆనతిని నెరవేరుస్తారు,'' అన్నాడు బంకించంద్ర.

ఆ రోజుల్లో మేజిస్ట్రేట్ ఆజ్ఞను ఎట్టి పరిస్థితులలో గాని ఎవరూ ధిక్కరించేవారు కాదు. ఖైదీలిద్దరినీ ఆ వంతెన దగ్గరికి నడిపించారు. బ్రజ్ గోపాల్ శరీరం తెల్లటి బట్టతో కప్పబడి ఉన్నది. పోలీసు, యువకుడు దానిని తీసి స్ట్రెచర్ మీద పడుకోబెట్టి తోసుకుంటూ, ముందు జవాను దారి తీయగా కోర్టుకేసి నడవసాగారు.

''మూర్ఖుడా! నీకు జరగనున్న అవమానం చూశావా? నన్ను పట్టుకోవడానికి నీకెంత ధైర్యం? ఈ జిల్లాలో వున్న దోపిడీ గాళ్ళందరికీనేను గురువును! నా యూనిఫారం కారణంగా నన్నింతవరకు అనుమానించిన నాధుడులేడు. ఇప్పుడు పట్టుబడినప్పటికీ తప్పక బయట పడతాను. మరీ నిఖార్సయిన ఈ మేజిస్ట్రేట్ నీకు కనీసం ఐదేళ్ళ కఠిన కారాగార శిక్షయినా విధించకుండా ఊరుకోడు,'' అంటూ పోలీసు నవ్వసాగాడు.

బ్రజ్‌పాల్ హత్య ఉదంతం వ్యాపించడంతో కోర్టు ఉద్యోగులతో, న్యాయవాదులతో న్యాయస్థానం కిటకిటలాడసాగింది.

స్ట్రెచర్‌ను మేజిస్ట్రేట్ ముందు దించారు. వెంటనే బ్రజ్‌పాల్ లేచి నిలబడి అందరినీ దిగ్భ్రాంతి పరిచాడు. ఇదంతా ఏర్పాటు చేసింది తనే గనక బంకించంద్ర మాత్రం మనసులోనే నవ్వుకున్నాడు.

బ్రజ్‌పాల్ బంకించంద్రకు నమస్కరించి దారిలో స్ట్రెచర్ మీద వస్తూండగా విన్న పోలీసు మాటలను వినిపించాడు.

పోలీసును కఠినంగా శిక్షించాలన్న మేజిస్ట్రేట్ అభిప్రాయాన్ని జ్యూరీ ఆమోదించింది. అందరూ యువకుణ్ణి అభినందించారు.

జమీందారు సంతోషంతో అతనికి చక్కని బహుమతినిచ్చాడు. -(ఎం.డి)



## చిరస్మరణీయ చారిత్రక ఘట్టాలు - 13

# ఉరితాడును ముద్దాడిన వీరకిశోరం!

బ్రిటిష్ అధికారానికి వ్యతిరేకంగా 1857లో చెలరేగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమనే గొప్ప తిరుగుబాటుకు చాలా సంవత్సరాలకు పూర్వమే దక్షిణాదిలో కొందరు పాలకులు పరాయి పాలనకు ఎదురు తిరిగారు. మాతృ భూమి విముక్తి కోసం పవిత్ర స్వాతంత్ర్య బీజాలను విత్తిన తొలితరం సమరయోధులలో మున్నెన్నతగినవాడు వీరపాండ్య కట్టబొమ్మన్.

కుందేలుపిల్ల వేటకుక్కలపై తిరగబడిన వీరభూమి అని పేరుగాంచిన తమిళనాడులోని పాంచాలన్‌కురిచ్చిలో జగవీరకట్టబొమ్మన్, ఆరుముగత్తమ్మాళ్ దంపతులకు 1760లో అనుపమ వీరుడైన వీరపాండ్య కట్టబొమ్మన్ జన్మించాడు. కుమారస్వామి, దొరైసింగం అనే సోదరులుగల కట్టబొమ్మన్ తన ముప్పైయవయేట 1790వ సం.లో సింహాసనం అధిష్ఠించాడు.

ఆ కాలఘట్టంలో దక్షిణాదిలోని పలు ప్రాంతాలు ఆర్కాడు నవాబు కింద ఉండేవి. అయితే, పలువురు పాలకులు నవాబు అధికారాన్ని ధిక్కరించసాగారు. దాంతో ఖజానా దివాలా తీసింది. నవాబు ఈస్టిండియా కంపెనీ నుంచి పెద్దమొత్తాలను తీసుకుని; వాటిని తన సామంతుల నుంచి పన్నుల రూపంలో వసూలు చేసుకోమని కంపెనీకి చెప్పాడు. నిస్సహాయులైన ప్రజలను కంపెనీ పీడించసాగింది. నవాబు కంపెనీ చేతి కీలుబొమ్మ అయ్యాడు. పలువురు సామంతులు బ్రిటిష్ అధికారానికి తల ఒగ్గారు.

అయితే, వీరుడైన కట్టబొమ్మన్ దానికి ఏమాత్రం అంగీకరించలేదు. ఆయన్ను లొంగదీసుకోవడానికి ఈస్టిండియా కంపెనీ నయానా భయానా ఎన్నెన్ని విధాలుగానో ప్రయత్నించింది. ఒక్కటీ ఫలించలేదు. అజేయుడైన కట్టబొమ్మన్ ఆరేళ్ళకాలం శత్రువుల కుట్రలకు వ్యతిరేకంగా ఒంటరి పోరాటం సాగించాడు. ఆయన్ను ఎలాగైనా అణచివేయాలని బ్రిటిష్ దొరతనం నిర్ణయించింది.

ఒకనాడు తన భవనం ఎదుట ఏదో గందరగోళం నెలకొనడం గమనించి తమ్ముడు కుమారస్వామి, సేనాధిపతి వెళ్ళయత్తేవన్, మంత్రి తానాపతి పిళ్లైతో కలిసి కట్టబొమ్మన్ వెలుపలికి వచ్చాడు. విశ్వాసపాత్రులైన తన ప్రజలు ఆందోళనకు లోనయ్యారని ఆయన గ్రహించాడు. బందిపోట్ల బాధలు ఎక్కువయ్యాయని వాళ్ళు చెప్పగా విన్నాడు. త్వరలో బందిపోట్ల బెడదను



పోగొట్టగలనని వాళ్ళకు ధైర్యం చెప్పి పంపాడు.

ఒకనాటి సాయం సంధ్యా సమయంలో కొందరు ధనిక వ్యాపారులు అడవి మార్గంలో వెళుతున్నారు. ఒక బండిలో అలంకరించ బడిన వధువు కూడా వాళ్ళతో పాటు వెళుతున్నది. ఉన్నట్టుండి నాయకుడు ఈలవేయగానే చుట్టు పక్కల చెట్ల మీద, పొదలలో దాగివున్న దోపిడీ దొంగలు కత్తులు దూసి వ్యాపారులను చుట్టు ముట్టారు.

అయితే, వ్యాపారులు కూడా తమ వద్ద దాచుకున్న కత్తులు కఠారులతో ఎదుర్కోవడంతో దొంగలు దిగ్భ్రాంతి చెందారు. అలంకరించబడిన 'పెళ్ళికూతురు' కూడా కత్తి దూసి అమితావేశంతో దొంగల మీదికి ఉరికింది. కొందరు దొంగలు చావగా, తక్కినవారు బందీలుగా పట్టుపడ్డారు. వీరపాండ్య కట్టబొమ్మన్ నాయకత్వంలో సైనికులే వ్యాపారుల్లా వచ్చారని గ్రహించిన దొంగలు క్షమించమని ఆయన పాదాలపై బడ్డారు.

ప్రజల మధ్య అసంతృప్తిని, అశాంతిని కలిగించడానికి ఇలా దారి దోపిడీలు చేయమని బ్రిటిష్ వాళ్ళే తమను పురికొల్పారన్న విషయాన్ని దొంగలు బయటపెట్టారు. కట్టబొమ్మన్ వాళ్ళను క్షమించి వదిలిపెట్టాడు. దొంగలు కృతజ్ఞతా భావంతో, పొరుగునవున్న యట్టయాపురం పాలకుడైన యట్టయప్పన్ బ్రిటిష్ కలెక్టర్ అడుగులకు మడుగులొత్తుతున్న విషయం కూడా కట్టబొమ్మన్‌కు చెప్పివెళ్ళారు. అందువల్ల కట్టబొమ్మన్ మీద కయ్యానికి కాలుదువ్వనున్నట్టు కూడా తెలియవచ్చింది. ఆ తరవాత శత్రువు తరపున తామే తన మీదికి దాడి జరపడానికి బ్రిటిష్ పాలకులు పథకం రూపొందిస్తున్న విషయం కూడా కట్టబొమ్మన్‌కు తెలిసింది.

మరి కొన్ని రోజులలో పాంచాలన్ కురిచ్చికి ఒక ఆంగ్లేయ దూత వచ్చాడు. కట్టబొమ్మన్ తప్ప తక్కిన స్థానిక పాలకులందరూ బ్రిటిష్ కలెక్టర్ జాక్సన్‌ను గౌరవార్థం వచ్చి దర్శించారని చెప్పాడు. చాలా ఆలోచించాక ఒక అవగాహన ఏర్పడుతుందన్న ఉద్దేశంతో కలెక్టర్‌ను కలుసుకోవడానికి కట్టబొమ్మన్ తన సమ్మతి తెలియజేశాడు. తన అంగరక్షకుడితో బయలుదేరాడు. అయితే, తను మాత్రమే లోపలికి రావాలని బ్రిటిష్ అధికారి ఆంక్ష విధించాడు.

కలెక్టర్ మకాం చేసిన రామనాధపురం భవనంలోకి కట్టబొమ్మన్ ఒంటరిగా ప్రవేశించాడు. కలెక్టర్ విశాలమైన గదిలో కూర్చున్నాడు. కట్టబొమ్మన్‌ను చూసి పలకరించనైనా లేదు. కలెక్టర్ కూర్చున్న కుర్చీ తప్ప మరో ఆసనమూ లేదు. వచ్చిన అతిథి నిలబడే మాట్లాడవలసిన పరిస్థితి. కలెక్టర్ రాసిపెట్టుకున్న ఆరోపణలను చదివి వినిపించాడు. వాదోపవాదాలు



మొదలయ్యాయి. కట్టబొమ్మన్ మాటకు మాట వేడిగా సమాధానం ఇవ్వడంతో, జాక్సన్ ఆవేశంతో పిడికిలి బిగించి లేచి నిలబడ్డాడు. మరుక్షణమే కట్టబొమ్మన్ ఒక్క గెంతున వెళ్ళి కుర్చీలో కూర్చుని విజయోత్సాహంతో మంద హాసం చేశాడు. జాక్సన్‌కు మరొక కుర్చీ తెప్పించుకోక తప్పలేదు.

"ఒక విదేశీయుడికి తలవంచి బానిసగా కట్టుబడి ఉండడం మా రాచరిక సంప్రదాయం కాదు. అందువల్ల నీకు నేను పన్ను చెల్లించను; నీకు డబ్బు కావాలంటే అప్పుగా అర్థించు. లేకుంటే బిచ్చమడుగు. అంతేగాని, ఆజ్ఞలు జారీ చేయడం చాలించు," అని గర్జించి ద్వారం కేసి అడుగులు వేశాడు కట్టబొమ్మన్.

ఆగ్రహించిన జాక్సన్ చప్పట్లు చరిచాడు. బ్రిటిష్ సైనికులు కట్టబొమ్మన్‌ను చుట్టుముట్టారు. కట్టబొమ్మన్ కత్తి దూసి మెరుపులా ముందుకు ఉరికి వారి తలలను తెగనరికి భవనం వెలుపలికి వచ్చాడు. జాక్సన్ తక్కిన వారిని పురికొల్పడానికి ముందే అక్కడ దాగి వున్న కట్టబొమ్మన్ అనుచరులు ఆయనకు సాయం వచ్చారు. ఆయన తమ్ముడు అమిత ధైర్యంతో పలువురిని హతమార్చాడు. బ్రిటిష్ సేనలను నడిపించిన లెఫ్టినెంట్ క్లార్క్‌ను దళనాయకుడు వెళ్ళయత్తేవన్ కడతేర్చాడు.

తమ నాయకుడు నేలకొరగగానే జాక్సన్ సైనికులు హతాశులయ్యారు. కట్టబొమ్మన్ యుద్ధం చేస్తూనే, దాపుల నిలబడ్డ గుర్రంపైకి ఎక్కి తప్పించుకున్నాడు. ఆయన తమ్ముడు, దళనాయకుడు కూడా ఆయన్ను అనుసరించారు. మరి కొంత సేపటికి అందరూ తమ సురక్షిత ప్రాంతాన్ని చేరుకున్నారు. అయితే, వాళ్ళ మంత్రి తానాపతి పిళ్లె మాత్రం దురదృష్టవశాత్తు ఖైదీగా పట్టుబడిపోయాడు!

ఆఖరికి ఆ చిన్న రాజ్యం మీదికి మేజర్ బ్యానర్‌మన్ నాయకత్వంలో శిక్షణ పొందిన సైన్యం బయలుదేరింది. అదే సమయంలో మంత్రి తానాపతి పిళ్లె జబ్బు పడ్డట్టు నటించాడు. కదలా మెదలక నేలపై పడుకున్నాడు. సంగతేమిటో తెలుసుకోడానికి జైలు కాపలా భటులు లోపలికి వెళ్ళారు. హఠాత్తుగా బంతిలా లేచి తానాపతిపిళ్ళె భటులను పొడిచి చంపాడు. ఉత్సాహంగా తన యజమాని వద్దకు తిరిగి వచ్చి, బ్రిటిష్ వాళ్ళ పథకం గురించి సేకరించిన సమాచారాన్ని అందించాడు.

వెనువెంటనే శత్రువులు పాంచాలన్ కురిచ్చి కోటను చుట్టుముట్టారు. "సర్వ నాశనం చేసేలోగా లొంగిపో!" అని హెచ్చరించారు. అయితే, కట్టబొమ్మన్ తలవొగ్గ లేదు. ధైర్యవంతులైన కట్టబొమ్మన్ సైనికులు, బ్రిటిష్ సేనలను ఎదుర్కొని వాళ్ళ దళనాయకుడు లెఫ్టినెంట్ కోలిన్స్‌ను హతమార్చారు. హడలిపోయిన బ్యానర్‌మన్ మరికొంత సైన్యం కోసం అధికారులకు సమాచారం పంపాడు.



సాయంకాల మయింది. హఠాత్తుగా కోట నుంచి పలువురు ఆశ్వికదళసైనికులు ఒక్క సారిగా వెలుపలికి దూసుకు వచ్చారు. ఎక్కడ చూసినా దుమ్ము, ధూళి కమ్ముకున్నది. మరునాడు తెల్లవారే సరికి కట్టబొమ్మన్ కోట నుంచి తప్పించుకున్నాడని బ్యానర్‌మన్‌కు తెలియవచ్చింది. ఆశ్వికదళాల పాదఘట్టన లతో లేచిన దుమ్ముధూళి మాటునే ఆయన సురక్షిత ప్రాంతానికి చేరుకున్నాడని ఆ తర వాత తెలియవచ్చింది!

ఆయన ఒక మిత్రుడి భవనంలో బసచేసి వున్న విషయం శత్రువులు పసిగట్టారు. పుదు కోట్టయ్ పాలకుడు తొండైమాన్ ఆయనకు ఆశ్రయమిచ్చాడు. కాని, బ్రిటిష్ పాలకులు చూపిన కానుకల మీది ఆశ కొద్దీ యట్టయప్పన్ లాంటి ద్రోహులు ఉప్పందించారు. కట్ట బొమ్మన్ ఖైదీగా పట్టుబడ్డాడు.

పరమానందం చెందిన మేజర్ బ్యానర్‌మన్ రకరకాల నేరారోపణలు చేసి కట్టబొమ్మన్‌కు మరణ దండన విధించాడు. మాతృదేశస్వాతంత్ర్యం కోసం పోరాడడమే ఆయన చేసిన అతి పెద్ద నేరం! ''బ్రిటిష్ సైనికులు పాంచాలన్ కురిచ్చి మీద దాడి చేయడం నేరం కాదు! నేను నా మాతృభూమి పరిరక్షణ కోసం వారి మీద ఎదురు దాడి జరపడం క్షమించరాని నేరం!!'' అంటూ వీరపాండ్య కట్టబొమ్మన్ దిక్కులు పిక్కటిల్లేలా సింహనాదం చేశాడు.

1799 అక్టోబర్ 16వ తేదీ తూరుపు తెల్లవారుతున్నది. చింత కొమ్మకు ఉరిత్రాడు విషసర్పంలా వేలాడుతున్నది. చుట్టూ జనం గుమిగూడారు. కట్టబొమ్మన్‌కు ద్రోహం తల పెట్టి ఆ వీరుణ్ణి శత్రువులకు పట్టి ఇచ్చిన సామంతులు కూడా నిర్జీవశిలాప్రతిమల్లా నిల బడి ఉన్నారు.

''దృఢంగా అడుగులు వేసుకుంటూ ముందుకు నడిచిన ఆయన తనకు ఇరు వైపులా నిలబడ్డ సామంతుల కేసి ఒకసారి ఏహ్యాభావంతో హేళనగా చూశాడు. ఉరికంబం దగ్గరికి నడిపించినప్పుడు ఆయన తన తమ్ముడి గురించి కొంచెం ఆదుర్దా కనబరచి నట్టు నా మనుషులు నాకు తెలియజేశారు. ఆయన ఎంతో దృఢ చిత్తంతో హుందాగా చెట్టు కిందికి నడిచాడు,'' అని బ్యానర్‌మన్ రాసుకున్నాడు.

ఆ వీరుడు కళ్ళు మూసుకుని కొద్ది క్షణాలు మాతృభూమి విముక్తికోసం ప్రార్థించాడు. కుర్చీ మీదికి ఎక్కి నిలబడ్డాడు. స్వయంగా ఉరితాటిని తన చేతులతో అందుకుని, తన మెడచుట్టూ ఉరి బిగించుకుని, నిలబడ్డ కుర్చీని తన్నాడు. -(ఏకెడి)





# మన ఒలింపిక్ పతక విజేతలు

ఆగస్టులో జరిగిన బీజింగ్ ఒలింపిక్ క్రీడలలో అభినవ్ బింద్రా షూటింగ్‌లో బంగారు పతకాన్ని, సుశీల్ కుమార్, విజేందర్ కుమార్‌లు రెస్లింగ్, బాక్సింగ్‌లలో కాంస్య పతకాలను గెలుపొంది మనదేశం గర్వించేలా చేశారు.

పాతికేళ్ళ అభినవ్ బింద్రా మన దేశానికి మొట్టమొదటి సారిగా ఒలింపిక్స్‌లో వ్యక్తిగత బంగారు పతకాన్ని సాధించి చరిత్ర సృష్టించాడు. రెండేళ్ళ క్రితం అతడు యుగోస్లేవియా జాగ్రెబ్‌లో వరల్డ్ షూటింగ్ ఛాంపియన్‌షిప్‌లో బంగారు పతకం గెలుపొందాడు. చైనాకు చెందిన 2004 ఒలింపిక్ గోల్డ్ మెడలిస్ట్ జు కినాన్‌నూ, ఫిన్లండ్‌కు చెందిన హెన్రీ హ్యాకినెన్‌ను అతడు అధిగమించాడు. ఛండీఘడ్‌కు చెందిన అభినవ్ 1982లో జన్మించాడు. క్రీడలలో షూటింగ్ ఒక అంశంగాగల సెయింట్ స్టీఫెన్స్‌లో చదివాడు. ఆ తరవాత జర్మనీలో శిక్షణ పొందాడు.

66 కె.జి. కేటగిరి ఫ్రీస్టయిల్ రెస్లింగ్‌లో సుశీల్ కుమార్ విజయం విస్మయం కలిగించింది. తొలి రౌండ్లలో సుశీల్ కుమార్ (25) ఉక్రెయిన్‌కు చెందిన యాండ్రీ స్టాడ్నిక్‌తో నెట్టుకురావడానికి శ్రమ పడ్డాడు. అయితే, చివరికి వచ్చేసరికి మూడు విజయాలను కైవసం చేసుకున్నాడు. కజకస్థాన్‌కు చెందిన సెమి ఫైనలిస్ట్ లియొనిడ్ స్పిరిడిడొనొవ్‌ను 3-1 పాయింట్లతో ఓడించి కాంస్యపతకం గెలుచుకున్నాడు. పతకం అందుకున్నప్పుడు అతడు ప్రశాంతంగా కనిపించినప్పటికీ ఢిల్లీ సమీపం నజాఫ్‌ఘడ్ పొలిమేరలోని అతడి స్వస్థలం బాప్‌రోలా గ్రామంలో మాత్రం పండుగ వాతావరణం నెలకొన్నది. ఇరవైరెండు మంది సభ్యులుగల అతడి కుటుంబంలో ఒక్క సుశీల్ మాత్రమే స్వయంగా పహిల్వాన్ అయిన తన తాతయ్యకు ఆనందం కలిగించేలా

అభినవ్ బింద్రా



సుశీల్ కుమార్



విజేందర్ కుమార్



రెస్లింగ్ పట్ల ఆసక్తి పెంపొందించుకున్నాడు. 1952 హెల్‌సింకీ క్రీడల్లో కాంస్య పతకం సాధించిన కె.డి. జాదవ్ తరవాత సుశీల్ కుమార్ కాంస్య పతకం అందుకున్న రెండవ భారతీయుడయ్యాడు.




బాక్సింగ్‌లో మరో కాంస్య పతకం గెలుపొందిన హర్యానాకు విజేందర్ కుమార్ (23) గత సంవత్సరం ఏసియన్ ఛాంపియన్‌షిప్‌లోనే రెండవ స్థానం సాధించాడు. భారత్ ఒలింపిక్ టీమ్‌లో గట్టివాడుగా విజేందర్ అందరి దృష్టినీ ఆకర్షించాడు. భివానీ స్కూల్ ఆఫ్ బాక్సింగ్ సభ్యుడైన విజేందర్ 75 కెజి కేటగిరిలో ఈక్వెడార్‌కు చెందిన కార్లోస్ గొంగోరాను 9-4 పాయింట్లతో ఓడించి సెమీస్ చేరుకున్నాడు. క్యూబాకు చెందిన ఎమిలియో కొరియా బేయియాక్స్‌ను అధిగమించలేక అతడు కాంస్య పతకంతో సరిపెట్టుకోవలసి వచ్చింది. ''విజేందర్ సాధించిన విజయం బాక్సింగ్‌కు కొత్త ఉత్తేజాన్నిస్తుంది,'' అన్నాడు పదవీవిరమణ చేసిన మిలిటరీ అధికారి అయిన విజేందర్ తాతయ్య.

అభినవ్ బింద్రా (చండీఘడ్), సుశీల్ కుమార్ (నజాఫ్‌ఘడ్) విజేందర్ కుమార్ (భివానీ) ముగ్గురు పతకవిజేతలూ ఢిల్లీ పరిసరాలలోని దాదాపు 200 కి.మీ. లోపు ప్రాంతానికి చెందిన వారేనన్నది మరో ఆసక్తికరమైన విశేషం!

## ప్రపంచ రికార్డులు

బీజింగ్ క్రీడలు 205 దేశాలకు చెందిన 10,700 మంది క్రీడాకారులను ఆకర్షించాయి. వారిలో 87 దేశాలు పతకాల జాబితాలో చోటు చేసుకున్నాయి. 51 బంగారు పతకాలతో సహా మొత్తం 100 పతకాలను సాధించి చైనా జాబితాలో ప్రథమస్థానాన్ని అలంకరించింది. అమెరికా 110 పతకాలను పొందినప్పటికీ ద్వితీయ స్థానంలో వచ్చింది.

బీజింగ్‌లో జరిగిన 29వ ఒలింపిక్ క్రీడలలో 43 కొత్త రికార్డులు సృష్టించబడ్డాయి. స్విమ్మింగ్ 8 రికార్డులను బద్దలుకొట్టి అమెరికాకు చెందిన మైఖేల్ ఫెల్ప్స్, 100 మీ (9.69 సెకన్లు) 200 మీ. (19.30 సెకన్లు) స్పీడు రికార్డులను అధిగమించి జెమైకాకు చెందిన ఉసెయిన్ బోల్ట్ మరపురాని సంచలనాన్ని సృష్టించారు. రష్యాకు చెందిన ఎలీనా ఇసిన్ బయీవా పోల్‌వాల్ట్‌లో 23వ ప్రపంచ రికార్డును (5.05మీ) సృష్టించింది.

### చందమామ క్విజ్ -7 (ఆగస్ట్ '08)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు.
అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం.



బీర్బల్ కథలు 14

# అపరాధ పరిశోధన

అక్బర్ చక్రవర్తి ఒక నాడు బీర్బల్‌ను వెంటబెట్టుకుని ఉద్యానవనంలో నడుస్తున్నాడు.

ఉన్నట్టుండి అక్బర్ చక్రవర్తి ఉబ్బెత్తుగా వాచిన కుడి మోచేతిని వేళ్ళతో గట్టిగా రుద్దసాగాడు. విపరీతమైన బాధ కలిగినప్పటికీ, బయట పడకుండా గంభీరం వహించాడు. వాపును పరిశీలించిన బీర్బల్ గట్టిగా నవ్వాడు.

''భరించరాని నొప్పితో నేను బాధ పడుతూంటే నవ్వడానికి నీకెంత ధైర్యం?'' అన్నాడు చక్రవర్తి వచ్చే కోపాన్ని అణుచుకుంటూ.

''క్షమించండి, షహేన్‌షా! తమరు బాధ పడుతున్నందుకు నేను నవ్వడంలేదు,'' అంటూ బీర్బల్ దాపులనున్న చెట్టు నుంచి నిమ్మ పండును కోసి వాచిన చక్రవర్తి మోచేతి మీద రసం పిండి మెల్లగా మర్దించాడు. చక్రవర్తికి కాస్త ఉపశమనం లభించినట్టయింది.

''అంటే, కందిరీగ కుట్టిన బాధను నిమ్మ రసం లాగేస్తుందంటావు,'' అన్నాడు చక్రవర్తి చిన్నగా నవ్వుతూ.

''తమరిప్పుడు ఆ సత్యాన్ని గ్రహించారు షహేన్‌షా. అయితే, వేరొక సత్యం తెలిసిరావడంతో నేను నవ్వాను,'' అన్నాడు బీర్బల్.

''ఏమిటది?'' అని అడిగాడు చక్రవర్తి.

''భగవంతుడి సృష్టిలో మనిషి చాలా గొప్పవాడని అనుకుంటాం కదా. అది నిజంకాదేమో అనిపిస్తోంది,'' అన్నాడు బీర్బల్.

''ఎందుకూ?'' అని అడిగాడు చక్రవర్తి.

''షహేన్‌షా! తమరు ప్రపంచంలోకెల్లా చాలా శక్తి సంపన్నులైన చక్రవర్తులు. అయినా కేవలం ఒక కందిరీగ, అల్పమైన కీటకం మీ అనుమతి లేకుండా మీ ఎదుట ఎగరడమే కాకుండా మిమ్మల్ని కుట్టి బాధపెట్టే సాహసం చేసింది కదా?'' అంటూ బీర్బల్ నాలుక్కరుచుకున్నాడు.

''నిజమే, బీర్బల్. అధికారాలు చాలా ప్రాణులను భయపెట్టడం లేదు. కందిరీగే కాదు పాములు, పులులను కూడా అదుపు చేయడం లేదు. ఎందుకంటే అవి ఉద్దేశపూర్వకంగా ఎదుటి వారికి హాని తలపెట్టడం లేదు. అపాయం అని తెలిసినప్పుడు మాత్రమే ఎదురు తిరిగి దెబ్బకొడతాయి. మనిషి అలాకాదు.

ఆలోచించి నేరాలకు పాల్పడతాడు. అలాంటి నేరస్థులను శిక్షించడం మా బాధ్యత,'' అంటూ అక్బర్ ఉద్యానవనం వెలుపలికి నడవసాగాడు.

ద్వారానికి అవతల చక్కటి దుస్తులు ధరించిన ఒక బట్టతల పెద్దమనిషి నిలబడి ఉన్నాడు. ఆయన వినయంగా వంగి, అక్బర్ చక్రవర్తికి నమస్కరించాడు. చక్రవర్తి, ''ఎవరు నువ్వు?'' అని అడిగాడు.

'నా పేరు బ్రజిదాస్. స్వర్ణకారుణ్ణి,'' అన్నాడు వృద్ధుడు.

''నీకు వచ్చిన సమస్య ఏమిటి?'' అని అడిగాడు చక్రవర్తి.

''షహేన్‌షా! నగలు తయారు చేయడానికి అవసరమైన బంగారాన్ని నేను ఒక ఇనుప బీరువాలో దాస్తాను. మామూలుగా నేను మాత్రమే వెళ్ళి అవసరమైనప్పుడు బంగారాన్ని తెచ్చుకుంటూ ఉంటాను. ఎప్పుడైనా ఏదైనా అత్యవసరమైన పని మీద ఉన్నప్పుడు విశ్వాస పాత్రులైన నలుగురు నౌకర్లలో ఒకరిని పంపుతూ ఉంటాను,'' అని ఆగాడు వృద్ధుడు.

''అంటే, ఆ నలుగురిలో ఒకరు బంగారం దొంగిలించారని చెప్పడానికి వచ్చావు. అంతే కదా?'' అని అడిగాడు చక్రవర్తి.

''అవును, షహేన్‌షా! ఆ నలుగురు నౌకర్లలో ఒకరే దొంగిలించి ఉండాలి,'' అన్నాడు వృద్ధుడు.

''ఎంత బంగారం దొంగిలించబడిందేమిటి?'' అని అడిగాడు చక్రవర్తి.

''పది కడ్డీలు పోయాయి ప్రభూ!'' అన్నాడు వృద్ధుడు విచారంగా.

''విచారించకు. మూడు రోజుల్లో దొంగిలించబడ్డ బంగారాన్ని పట్టుకుని నీకు తిరిగి



అప్పగించబడేలా చేస్తాను,'' అన్నాడు చక్రవర్తి.

వృద్ధుడు వంగి నమస్కరించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

''దోషిని కనుగొనే మార్గం ఏదైనా ఉందా ప్రభూ?'' అని అడిగాడు బీర్బల్.

''ఆ పనిని రక్షకభట అధికారికి అప్పగిస్తాను,'' అన్నాడు చక్రవర్తి.

రెండు రోజులు ఆ పని మీద నిర్విరామంగా పని చేశాడు రక్షకభట అధికారి. నలుగురు నౌకర్లను తీసుకువచ్చి విచారణ జరిపాడు. నలుగురిని నాలుగు గదులలో బంధించాడు. నిజం చెప్పకపోతే తల్లకిందులుగా వేలాడదీసి చితక బాదుతానని బెదిరించాడు. అయితే, నిజం బయట పడలేదు. అసలైన దొంగను పట్టుకోవడం ఎలాగో అధికారికి అంతుబట్టలేదు.

రెండో రోజు సాయంకాలం అయ్యేసరికి



అధికారి తన సమస్యను వివరించి, ''నలుగురిని నాలుగు గదులలో ఉంచి వేధించినా నిజం బయట పెట్టనంటున్నారు. వాళ్ళలో దొంగ ఎవరో కనుగొనడం నావల్ల కావడం లేదు. ఇందులో నీ సాయం కోరివచ్చాను,'' అన్నాడు.

బీర్బల్ మౌనంగా కొంతసేపు ఆలోచించి, ''తప్పకుండా ఈ ఉపాయం ఫలించి తీరుతుంది,'' అన్నాడు.

''అదేమిటో నేను తెలుసుకోవచ్చా?'' అని అడిగాడు అధికారి.

''ఒక్కొక్కటి ఒక గజం పొడవున నాలుగు కర్రలను సిద్ధంచెయ్. ఒక గంటలో నేను రక్షకభటనిలయానికి వస్తాను. నేను ఆ నలుగురి నౌకర్లతో మొదట మాట్లాడాలి. ఆ తరవాత ఏం జరుగుతుందో నువ్వే చూస్తావు కదా?'' అన్నాడు బీర్బల్.

అధికారి అక్కడి నుంచి బయలుదేరాడు.

ఒక గంట తరవాత బీర్బల్ రక్షకభట నిలయానికి చేరుకున్నాడు. అధికారి, ''ఇదిగో నువ్వు చెప్పిన కర్రలు సిద్ధంగా ఉంచాను,'' అన్నాడు.

''ఆ నలుగురు నిందితులను ఇక్కడికి తీసుకురా,'' అన్నాడు బీర్బల్.

అధికారి లోపలికి వెళ్ళి కొంతసేపటికి నిందితులు నలుగురిని తెచ్చి బీర్బల్ ఎదుట నిలబెట్టాడు. వాళ్ళు బాగా అలిసిపోయి నీరసంగా ఉన్నట్టు బీర్బల్ గ్రహించాడు. రెండు రోజులుగా నిద్రాహారాలు లేకుండా వాళ్ళను హింసిస్తున్నాడు అధికారి.

ఆ తరవాత అతడు చిన్నగా నవ్వి నలుగురినీ దగ్గరికి పిలిచి, ''తన ఇంట్లో పది కడ్డీల బంగారం దొంగతనం జరిగిందని మీ యజ

అధికారికి ఏంచెయ్యాలో తెలియక సతమతం కాసాగాడు. చక్రవర్తి దగ్గరికి వెళ్ళి దొంగను పట్టలేక పోయానని చెప్పలేడు కదా. బోనులోని పులిలా అతడు అటూ ఇటూ తిరగసాగాడు. ''దొంగను కనుగొనడం ఎలా? నా మట్టిబుర్రకు ఏ ఉపాయమూ తోచడం లేదే? ఈ విపత్కర సమయంలో ఆదుకునే వారెవ్వరు?'' అనుకుంటూ తన ఎరుకలోని తెలివైన వాళ్ళ గురించి ఆలోచిస్తూ, ''ఆ... బీర్బల్! ఆ మహానుభావుడొక్కడే ఈ గండం నుంచి గట్టెక్కించగలడు!'' అన్నాడు బిగ్గరగా.

ఆ తరవాత క్షణం కూడా వృథా చెయ్యకుండా బీర్బల్ ఇంటికి బయలుదేరాడు. ఆయన్ను చూడగానే బీర్బల్ సాదరంగా స్వాగతం పలికి మర్యాదలు చేసి, ''నీ రాకకు కారణం తెలుసుకోవచ్చా?'' అని అడిగాడు.

వాని బ్రిజిదాస్ చక్రవర్తికి ఫిర్యాదు చేశాడు. ఆ బంగారం ఉన్న చోటు తనకూ, మీ నలుగురికీ తప్ప మరెవ్వరికీ తెలియదని ఆయన చెబుతున్నాడు. అది నిజమేనా?'' అని అడిగాడు.

''అవును, బాబూ!'' అన్నారు నలుగురూ ముక్తకంఠంతో.

''మీలో ఎవరో ఒకరు దొంగిలించి ఉండాలని ఆయన ఆరోపిస్తున్నాడు,'' అన్నాడు బీర్బల్.

'నేను నమ్మకద్రోహిని కాను,'' అన్నాడు ఒక నౌకరు.

'నేను ఆయన దగ్గర ఇరవై యేళ్ళుగా పని చేస్తున్నాను. ఆయనకెలా ద్రోహం చేయగలను?'' అన్నాడు రెండవ నౌకరు.

''నేను చాలా నిజాయితీగలవాణ్ణి. దొంగబుద్ధి నా ఇంటా, వంటా లేదు,'' అన్నాడు మూడవవాడు.

''ఆయన ఉప్పు తిని బతుకుతున్నాను. తిన్న ఇంటికే కన్నంవేసే నీచుణ్ణి కాను,'' అన్నాడు నాలుగోవాడు.

''మీరు నలుగురూ నిజాయితీపరులే అనుకుంటాను. మీ మీద పొరబాటుగా నిందారోపణ జరిగిందనుకుంటున్నాను,'' అంటూ బీర్బల్ అక్కడున్న నాలుగు కర్రలను తీసి నలుగురికీ చెరొకటి ఇచ్చాడు. ఆ తరవాత, ''ఇవి మహిమగల కర్రలు. నిజాయితీ లేనివారి దగ్గర ఉన్నట్టయితే ఇవి తెల్లవారే సరికి మూడు అంగుళాల పొడవు అదనంగా పెరుగుతాయి. వీటిని రాత్రికి మీ వద్ద ఉంచుకోండి. రేపు ఉదయం ఎనిమిది గంటలకు నా దగ్గ

## మన దేశం క్విజ్

మన కొన్ని పండుగలు, ఉత్సవాల గురించి ఈ నెల క్విజ్‌లో గుర్తుచేసుకుందాం.



1. ఉత్తరభారతదేశంలో నవరాత్రుల చివరి రోజున మూడు పెద్ద దిష్టిబొమ్మలను తగలబెడతారు. ఆ దిష్టిబొమ్మలు ఎవరిని సూచిస్తాయో తెలుసా?

2. పన్నెండు సంవత్సరాలకొకసారి ఒక నెల పాటు జరిగే ఉత్సవం ఏది? ఆ ఉత్సవాలు జరిగే నాలుగు ప్రదేశాలు ఏవి?

3. హోలీకి సంబంధించిన రెండు పురాణ పాత్రలు ఏవి?

4. శిక్కుల పండుగ బైసాఖి ప్రాముఖ్యత ఏమిటి?

5. హిందువులు ఇద్దరు దేవతలను విగ్రహ రూపాలతో పూజించి ఆ తరవాత సముద్రంలోనో, నదులలోనో నిమజ్జనం చేస్తారు. ఆ దేవతలు ఎవరు? ఆ పండుగలు ఏవి?

(సమాధానాలు 74వ పేజీలో)

రికి తీసుకురండి. మీ కోసం ఎదురు చూస్తూ ఉంటాను,'' అని చెప్పి పంపేశాడు.

మరునాడు ఉదయం నలుగురూ చెప్పిన సమయానికి కర్రలతో వచ్చారు. ఆ తరవాత కొంత సేపటికి వచ్చిన బీర్బల్ వారిని పలకరించాడు. మొదట ఒక నౌకరును పిలిచి అతడిచ్చిన కర్ర పొడువును కొలిచి పక్కన పెట్టాడు. ఆ తరవాత అదే విధంగా తక్కిన ముగ్గురు అందించిన కర్రలను కూడా ఒక్కొక్క దాన్నీ కొలిచి చూశాడు. అతడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

అతడు మూడో నౌకరు కేసి చూస్తూ, ''నువ్వే దొంగవు!'' అన్నాడు. అతడు కాదని బుకాయించడానికి చూశాడు గాని అలా ఎంతో సేపు సాగలేదు.

బీర్బల్ ఆ మూడో నౌకరు తెచ్చిన కర్రను చూపాడు. అది మిగిలిన మూడు కర్రలకన్నా మూడు అంగుళాలు కురచగా ఉన్నది.

''నువ్వు ఏం చేశావో నాకు తెలుసు. తెల్లవారే సరికి కర్ర మూడంగుళాలు పెరిగి పోతుందని భయపడి పోయావు. ఎందుకంటే నువ్వు నిజాయితీ పరుడివికావు. ఎలాగైనా పట్టుబడకుండా ఉండాలని నీ కర్ర పొడవును మూడంగుళాలు కత్తిరించేశావు. అందువల్లే అది కురచగా ఉన్నది,'' అన్నాడు బీర్బల్.

''అంటే... దొంగ దగ్గరి కర్ర తెల్లవారే సరికి మూడంగుళాలు పెరుతుందని నువ్వు అబద్ధం చెప్పావన్న మాట. నేను అది నిజమని నమ్మి మోసపోయాను,'' అంటూ దొంగ నేలచూపులు చూడసాగాడు.

రక్షకభటులు దొంగ సొమ్మును తెచ్చి బజ్రిదాస్‌కు అప్పగించారు. దొంగ కారాగారం పాలయ్యాడు. రక్షకభట అధికారి కొలువుదీరి ఉన్న అక్బర్ చక్రవర్తి వద్దకు వచ్చాడు. అప్పుడక్కడ బీర్బల్ కూడా ఉన్నాడు.

''మీరు అప్పగించిన సమస్యను పరిష్కరించాను. అందుకు బీర్బల్‌కు కృతజ్ఞతలు చెప్పాలి,'' అన్నాడు అధికారి.

''మధ్య బీర్బల్ ఏం చేశాడు?'' అని అడిగాడు చక్రవర్తి.

''అవును, షహేన్‌షా!'' అంటూ అధికారి దొంగను పట్టినవైనం గురించి పూసగుచ్చినట్టు వివరించాడు.

''బీర్బల్! నిజంగా నువ్వు అపరాధ పరిశోధనశాఖకు అధికారిగా ఉండతగినవాడివి!'' అని ప్రశంసిస్తూ చక్రవర్తి అతనికి బంగారు కడియాన్ని బహూకరించాడు. -(ఆర్.కె. మూర్తి)





# లోకం తీరు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు కృష్ణద్వైపాయనుడనే ధనిక బ్రాహ్మణుడుగా కౌశాంబీ నగరంలో జన్మించాడు. ఆయన లౌకిక వాంఛలవల్ల కలిగే అనర్థాలను గుర్తించి, సన్యాసం అవలంబించి, యాభైఏళ్ళపాటు హిమాలయ పర్వతాలలో తపస్సు చేసుకుంటూ గడిపాడు.

అటుపైన కృష్ణద్వైపాయనుడు హిమాలయాలను వదిలి, తీర్థయాత్రలు చేస్తూ కాలక్రమాన కాశీరాజ్యానికి వచ్చాడు. అక్కడ ఆయనకు బాల్యమిత్రుడొకాయన, మాండవ్యుడు అనేవాడు, ఒక గ్రామంలో కనిపించి ఆతిథ్యం ఇచ్చాడు. మాండవ్యుడు కృష్ణద్వైపాయనుణ్ణి తన వద్దనే ఉండమని కోరాడు; ఆయన నిమిత్తం చక్కని పర్ణకుటీరం ఒకటి కట్టించి, ఆయన అవసరాలన్నిటినీ తాను యథావిధిగా తీర్చుతూ వచ్చాడు.

ఒకనాడు, మాండవ్యుడి కుమారుడు, యజ్ఞదత్తుడనేవాడు, బంతితో ఆడుతూ ఉండగా ఆ బంతి వెళ్ళి ఒక పాము పుట్టలో పడింది. యజ్ఞదత్తుడు బంతి తీసుకోవటానికై పుట్టలో చెయ్యిపెట్టాడు. వాడి చేతిని పాము కరిచింది. త్వరలోనే పాము విషం వంటికి ఎక్కి యజ్ఞదత్తుడు స్పృహలేకుండా పడిపోయాడు.

తమ కుమారుడు ఈ స్థితిలో పడి ఉండగా మాండవ్యుడూ, ఆయన భార్యా వాణ్ణిచూశారు. మాండవ్యుడు తన కుమారుణ్ణి కృష్ణద్వైపాయనుడి కాళ్ళముందు పడుకోబెట్టాడు.

''మీ తపశ్శక్తిచేత వీణ్ణి బతికించి మాకు పుత్రభిక్ష పెట్టండి!'' అని ఆ దంపతులు ప్రాధేయపడ్డారు.

కృష్ణద్వైపాయనుడికి ఏమి చెయ్యాలో అసలు తోచలేదు. 'నేను అంతకాలం తపస్సు

జాతక కథ



చేశానేగాని, ఆ తపస్సు సిద్ధించలేదు. కనీసం నాకు మందూ మాకులూ అయినా తెలీవు. నేను మీ పిల్లవాణ్ణి ఎలా బతికించగలను?'' అన్నాడు.

''తపస్సు సిద్ధించకపోయినా అంతకాలం చేసిన తపస్సుకు ఫలితం ఉండక పోదు. మీరు సత్యప్రమాణం చెయ్యండి, కుర్రవాడు తప్పక బతుకుతాడు!'' అన్నాడు మాండవ్యుడు.

కృష్ణద్వైపాయనుడు ఇందుకు సమ్మతించి, ఈ కింది శ్లోకం చదువుతూ సత్య ప్రమాణం చేశాడు.

''సత్తాహం ఏవాహం ప్రసన్నచిత్తో
పుంజ్ఞత్థికో ఆచరిం బ్రహ్మచరియం।
అథాపరం యం చరితం మమయిదం
వస్సాని పంజ్ఞాస సమాధికాని
అకామకో వా హి అహం చరామి।
ఏతేన సచ్చేన సువత్థి హోతు।
హతం, విసం, జీవతు యంజ్ఞదత్తో॥''

[నేను పుణ్యం కోరినవాణ్ణిఅయి వారం రోజులపాటు నిర్మల చిత్తంతో బ్రహ్మచర్యం అవలంబించాను. తరవాత నేను యాభై ఏళ్ళపాటు చేసిన తపశ్చర్య చిత్తశుద్ధితో చేసినది కాదు. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు పూర్ణజీవుడౌ గాక!]

వెంటనే కుర్రవాడి వక్షస్థలం నుంచి కొంత విషం బయటికి వచ్చి నేలలో ఇంకి పోయింది. వాడు, ''అమ్మా!'' అని మూలిగి, పక్కకు ఒత్తిగిలి తిరిగి మైకంలో పడిపోయాడు.

''చూశావు గదా? విషం పూర్తిగా లాగి వెయ్యటం నాకు సాధ్యం కాలేదు. నువ్వు కూడా సత్యప్రమాణం చేసి చూడు, ఫలితం ఉండవచ్చు, '' అని కృష్ణద్వైపాయనుడు మాండవ్యుడితో అన్నాడు.

మాండవ్యుడిందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేశాడు.

''యస్మా దానం న అభినందిం కదాచి
దిరవానాహం అతిథింవా సకాలే
న చాపి మే అప్పియం అలేదుం
బహుస్సుతా సమణా బ్రాహ్మణాచ
అకామకో వా హిఅహం దదామి,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం విసం, జీవతు యంజ్ఞదత్తో.''

[నేను అతిథులను సత్కరించానుగాని, అది ఇష్టంతో కాదు. జ్ఞానులైన శ్రమణులూ, బ్రాహ్మణులూ నా ఆతిథ్యం ఇష్టం లేకుండా చేసినదేనని తెలుసుకోలేకపోయారు. నేను

దానాలు కూడా ఇష్టం లేకుండానే చేశాను. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు పూర్ణజీవుడౌ గాక!]

మాండవ్యుడు ఈ విధంగా సత్యప్రమాణం చెయ్యగానే యజ్ఞదత్తుడి వీపు నుంచి మరి కొంత విషం బయటికి వచ్చి నేలలో ఇంకి పోయింది. కుర్రవాడు లేచి కూచోగలిగాడు గాని, నిలబడలేక పోయాడు. అప్పుడు మాండవ్యుడు తన భార్యకేసి తిరిగి ఇలా అన్నాడు. ''నువ్వు కూడా సత్యప్రమాణం చెయ్యరాదా? కుర్రవాడు లేచి ఎప్పటిలాగా తిరగ గలుగుతాడు.''

''నేను ప్రకటించవలిసిన సత్యం కూడా ఉన్నది గాని, దాన్ని మీ ముందు ప్రకటించ టానికి వీలులేదు,'' అన్నది మాండవ్యుడి భార్య విచారంగా.

''పిచ్చిదానా, ఎందుకు సందేహిస్తావు? మన కుర్రవాడికన్న ఎక్కువేమిటున్నది? సత్యప్రమాణం చెయ్యి,'' అన్నాడు మాండ వ్యుడు. తన భార్యను ప్రోత్సహించాడు.

ఆమె అందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేసింది:

''అసో విసో తాత పహూత తేజో
యే తం అదట్ఠి పతరా ఇదచ్చి,
తస్మించ మే అప్పియతాయ అజ్జ
పితరి చతే నత్థి కోచి విసేసో,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం విసం, జీవతు యంజ్ఞదత్తో.''

[నాయనా, ఇవాళ నిన్ను ఆ పుట్టలో నుంచి



కాటువేసిన విషసర్పాన్ని చూస్తే నాకెంత అసహ్యమో, నీ తండ్రిని చూసినా అంత అసహ్యమే. నాకు ఈ ఇద్దరిలో తేడా ఏమీ కనిపించ లేదు. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞ దత్తుడు వెంటనే పూర్ణజీవుడౌ గాక!]

ఈ సత్యప్రమాణంతో యజ్ఞదత్తుడి శరీ రంలో నుంచి విషం పూర్తిగా బయటికి వచ్చి నేలలో ఇంకిపోయింది. వాడు లేచి ఎప్పటి లాగే ఆడుకోసాగాడు.

మాండవ్యుడు కృష్ణద్వైపాయనుడి కేసి తిరిగి, ''స్వామీ, మీరు ఉత్తమోత్తమమైన తపస్వి జీవితాన్ని స్వీకరించి కూడా దాన్ని ఇష్టం లేకుండా సాగించటానికి కారణ మేమిటి?'' అని అడిగాడు.

అందుకు కృష్ణద్వైపాయనుడు, ''దానికి ఒకటే కారణం. ఒకసారి సన్యసించి వెళ్ళి

పోయినవాడు తిరిగి సంసారంలోకి అడుగు పెడితే అందరూ హేళనచేసి, మూఢుడని నిందిస్తారు! అందుచేత, ఆ జీవితం నాకు ఇష్టం లేకపోయినప్పటికీ అందరూ నన్ను గౌరవంగా చూడగలందులకైనేను తపస్విగానే ఉండి పోయాను! మరి నువ్వు అతిథి అభ్యాగతులకు ఇంత ఘనంగా ఆతిథ్యం ఇస్తావు గదా, ఆ పని అయిష్టంగా చెయ్యటానికి కారణమేమిటి?'' అని అడిగాడు.

''నా తాతా, తండ్రీ జగత్ప్రసిద్ధి పొందిన దాతలు. అందుచేత నేను కూడా వారి మార్గమే అనుసరించవలిసి వచ్చింది. వారి కీర్తికి కళంకం తెచ్చానని జనం నన్ను ఆడిపోసుకోకుండా ఉండగలందులకై నేను వితరణగా దాన ధర్మాలు చేశాను; నాకు వాటియందు ఏ మాత్రమూ ఇష్టం ఉండి కాదు,'' అని జవాబు చెప్పి, మాండవ్యుడు తన భార్య కేసి తిరిగి, ''పసితనంలోనే నాకు భార్యవై నా ఇంటికి వచ్చావు. ఇన్నేళ్ళుగా నాతో కలిసి కాపురం చేశావు. నాపైన ప్రేమాభిమానాలు లేని ఈ జీవితం నీకెంతో రోత పుట్టించి ఉండాలి. దానిని మౌనంగా ఎందుకు సహించావు?'' అని అడిగాడు.

దానికి మాండవ్యుడి భార్య, ''మన వంశంలో స్త్రీ తన భర్తతో కాపురం చెయ్యటం విధి గనక ఈ జీవితం భరించాను. నేను మిమ్మల్ని విడిచి వెళ్ళిపోయి మరొక భర్తను కట్టుకున్నట్టయితే లోకమంతా నన్ను కులటగా భావించి ఉండేది. మన అబ్బాయి క్షేమం కోరి మాత్రమే నేనీ విషయం బయట పెట్టాను!'' అన్నది.

''నిజం చెప్పినందుకు నేను నిన్ను తప్పు పట్టను. ఇకముందు నిన్ను ప్రేమతో చూస్తానని ప్రమాణం కూడా చేస్తున్నాను!'' అన్నాడు మాండవ్యుడు తన భార్యతో.

''నువ్వు దానాలు చెయ్యదలిస్తే ఇష్టంతోనే చెయ్యిగాని, ఇష్టం లేకుండా లోకానికి భయపడి చెయ్యకు. నేను కూడా ఇక మీదట ఈ తాపసి జీవితం మనస్ఫూర్తిగా సాగిస్తాను!'' అంటూ కృష్ణద్వైపాయనుడు మాండవ్యుడి వద్ద సెలవు పుచ్చుకుని, తన దారిన తాను వెళ్ళిపోయాడు.





# రామాయణం

ఆ కాకి ఇంద్రుడి కొడుకు, పక్షులలో మేటి. బ్రహ్మాస్త్రం వెంట పడగా ఆ కాకి భయపడి మూడు లోకాలూ తిరిగింది. ఇంద్రుడుగాని, దేవతలు గాని దానిని కాపాడలేకపోయారు. అది తిరిగి రాముడి వద్దకే వచ్చి శరణన్నది. రాముడు శరణాగత వత్సలుడు గనక దాన్ని క్షమించాడు; కాని బ్రహ్మాస్త్రం వృథాపోవటానికి వీలులేనందున ఆ కాకి యొక్క కుడి కన్ను నాశనం చేశాడు.

సీత హనుమంతుడికి ఈ సంగతంతా చెప్పి, ''ఇంత సమర్థుడై ఉండి కూడా నా భర్త నన్ను రక్షించే ప్రయత్నం చెయ్యలేదంటే అందుకు నేను చేసి ఉండిన మహాపాపమే కారణమై ఉండాలి,'' అన్నది విచారంగా. హనుమంతుడామెను ఓదార్చి, రామలక్ష్మణులకూ, సుగ్రీవుడికీ, వానరులకూ ఏం చెప్పమన్నావని అడిగాడు.

''రాముడి కుశలం అడిగానని చెప్పు. ఆయనకు నా సాష్టాంగ నమస్కారం చెప్పు. నన్ను తల్లిలాగా చూసుకున్న లక్ష్మణుడి క్షేమం అడిగానని చెప్పు. అతను సమయానికి దగ్గర ఉన్నా నన్ను రావణుడపహరించి ఉండలేడు. రాముణ్ణి బయలుదేర దీయటానికి నీకన్న సమర్థులు లేరు,'' అంటూ సీత తన కొంగున కట్టి ఉన్న చూడామణి తీసి హనుమంతుడికిచ్చి, ''దీన్ని మా అమ్మ నాకు వివాహసమయంలో ఇచ్చింది. అప్పుడు దశరథ మహారాజు కూడా అక్కడే ఉన్నాడు. దీన్ని చూడగానే రాముడికి మా అమ్మా, తన తండ్రీ, నేనూ జ్ఞాపకం వస్తాం,'' అన్నది.

సుందరకాండ - 5



హనుమంతుడిప్పుడు తిరిగి మామూలు రూపం ధరించి ఉన్నాడు. అతనా చూడా మణిని తీసుకుని, చేతికి తొడగటం సాధ్యం కాక, వేలికి తగిలించుకున్నాడు.

హనుమంతుడు సీతకు చెప్పవలిసిన ధైర్యమంతా చెప్పి ఆమెను విడిచి ఇవతలికి వచ్చి, రావణుడి సంగతి కొంతవరకు అంతు తేల్చుకుని పోదామని నిశ్చయించుకున్నాడు. ఇంత శ్రమపడి లంకకు వచ్చి సీతను మాత్రం చూసి తిరిగి వెళ్ళిపోవటం అతనికి భావ్యంగా తోచలేదు. రాక్షసులేపాటి పరాక్రమవంతులో, యుద్ధం చెయ్యటంలో వారికీ, వానరులకూ గల తారతమ్యం ఏమిటో తెలుసుకుని వెళ్ళితే సుగ్రీవుడి ఆజ్ఞను సరిగా నెరవేర్చినట్టవుతుం దని అతనికి అనిపించింది. పనిలోపనిగా రావణుడికి కూడా వానర పరాక్రమం ఏమిటో చూపినట్టూ అవుతుంది! రావణుణ్ణి రెచ్చ గొట్టాలంటే నందనవనం లాగున్న అశోకవ నాన్ని నాశనం చెయ్యటం కన్న మంచి మార్గం లేదనుకుని హనుమంతుడు తన శక్తి కొద్దీ అశోకవనంలోని చెట్లను కూలదోయ సాగాడు. క్రీడా సరోవరాలను ధ్వంసం చేశాడు. క్రీడా పర్వతాలను కూలదోశాడు. అశోకవన మంతా బీభత్సమైపోయింది. చెట్ల మీది పక్షులన్నీ భయపడి అరిచాయి. లతలన్నీ తెగి వాడు ముఖాలు వేశాయి. ఇళ్ళన్నీ కూలిపోయాయి.

హనుమంతుడు చేసిన విధ్వంసానికి రాక్షస స్త్రీలందరూ పరిగెత్తుకొచ్చి హనుమం తుణ్ణి చూశారు. వాళ్ళు సీతతో, ''వీడెవడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎవరు పంపారు? నీతో ఏమిటి మాట్లాడాడు?'' అని అడిగారు.

''అతనెవడో నాకేం తెలుస్తుంది? రాక్షస మాయలు మీ రాక్షసులకే తెలియాలి! అతణ్ణి చూస్తే నాకూ భయంగానే ఉంది. ఎవరతను? మీరే చెప్పండి,'' అన్నది సీత.

సీత ఇలా అనగానే రాక్షస స్త్రీలు హడలి పోయారు. వారిలో కొందరు సీతను రక్షించ టానికి ఉండిపోతే, మిగిలిన వారు రావణు డితో చెప్పటానికి పరిగెత్తారు. వాళ్ళు రావణు డితో, ''భయంకరమైన దేహమూ, అపారమైన బలమూ కల వానరుడెవడో వచ్చి సీతతో ఏదో మాట్లాడాడు. వాడిప్పుడశోకవనంలో ఉన్నాడు. వాడెవడని అడిగితే సీత చెప్పటంలేదు. ఎవరు పంపగా వచ్చాడో గాని ఆ వానరుడు అంతః పుర వనమంతా నాశనం చేసేశాడు. సీత కూర్చునే చెట్టు మాత్రం విరవ లేదు. సీత ఒక



శింశుపా వృక్షం కిందికి వెళ్ళింది. దాన్ని కూడా వాడు విరవలేదు. అశోకవనం ధ్వంసం చేశాడు గనకా, నువ్వు తెచ్చిన సీతతో మాట్లాడాడు గనకా, రెండు విధాలా వాడు చంపదగిన వాడే,'' అన్నారు.

రావణుడీ మాటలు విని ఆగ్రహావేశం చెంది, హనుమంతుణ్ణి పట్టుకోమని తనంత పరాక్రమంగల ఎనభైవేల మంది రాక్షసులను, కింకరులనే పేరుగల వాళ్ళను ఆజ్ఞాపించాడు. వారు వివిధాయుధాలతో బయలుదేరి వెళ్ళి, అశోకవన ద్వారం వద్ద ఉన్న హనుమంతుడి పైకి విజృంభించారు. వారు తనను చుట్టుముట్టగానే హనుమంతుడు తన తోకను నేలకేసి కొట్టి గట్టిగా అరిచాడు. ఆ ధ్వనికీ, అతను భుజాలు చరచుకున్న చప్పుడుకూ లంక అంతా మారుమోగింది.

''జయం రామలక్ష్మణులది, వానర రాజైన సుగ్రీవుడిది! నేను రాముడికి దాసుణ్ణి. నా పేరు హనుమంతుడు. శత్రుహంతకుణ్ణి. వెయ్యిమంది రావణులు నాకు యుద్ధంలో సాటిరారు. ఈ రాక్షసులంతా చూస్తూండగానే ఈ లంకానగరాన్ని నాశనం చేసి, సీతకు నమస్కరించి, రాముడివద్దకు తిరిగి పోతాను,'' అని హనుమంతుడు గట్టిగా అరిచాడు.

ఎర్రగా పర్వతాకారుడై కనిపించే హనుమంతుణ్ణీ, అతని అరుపూ చూసి రాక్షసులు భయపడ్డారు గాని, రాజాజ్ఞ తప్పదు గనక రాక్షసులతని పైన ఆయుధాలను ప్రయోగించారు. హనుమంతుడు పెద్ద పరిఘను చేత బట్టుకుని, దానితో రాక్షసులను చావమోదాడు.

ఇలా కింకరులనే రాక్షసులను మట్టుబెట్టి, ఇంకా యుద్ధకాంక్ష తీరక, హనుమంతుడు ద్వారం వద్దనే వేచి ఉన్నాడు.

ఈలోపల పారిపోయిన రాక్షసులు కొందరు రావణుడి వద్దకు వెళ్ళి, కింకరులందరూ హనుమంతుడి చేత చచ్చారని చెప్పారు. రావణుడు మండిపడి గుడ్లు తిప్పుతూ, హనుమంతుడితో యుద్ధం చెయ్యమని ప్రహస్తుడి కొడుకైన జంబుమాలి అనే వాణ్ణి, యుద్ధంలో ఓటమిఎరగని మహాశూరుణ్ణి ఆజ్ఞాపించాడు.

కింకరులను చంపి నిలబడి ఉన్న హనుమంతుడికి అశోక వనంలోని చైత్యంలాటి భవనం జ్ఞాపకం వచ్చింది. దాన్ని అతను ధ్వంసం చెయ్యలేదు. ఆ పని చేద్దామని అతను ఒక్క ఎగురున ఆ చైత్య ప్రాసాదం మీదికి దూకాడు. ఆ ప్రాసాదాన్ని రక్షించే వారు నూరుమంది



ఎఱ్ఱని పూలమాలలు ధరించి, తలలో పూలు పెట్టుకుని, కుండలాలు ధరించి, ఇంద్రధనుస్సు లాటి విల్లూ, అందమైన బాణాలూ తీసుకుని జంబుమాలి గాడిదలు పూన్చిన రథంలో వచ్చేసరికి హనుమంతుడు ద్వారతోరణం పైన కూర్చుని ఉన్నాడు. జంబుమాలి విల్లెక్కుపెట్టి అనేక బాణాలు ప్రయోగించి హనుమంతుడి ముఖాన్నీ, దేహాన్నీ గాయపరిచాడు; హనుమంతుడు పెద్దరాయి విసిరితే దాన్ని బాణాలతో పడగొట్టాడు; సాలవృక్షం పీకితే దాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. చివరకు హనుమంతుడు మొదట తీసుకున్న పరిఘనే తీసి గిరగిరా తిప్పి విసిరేసరికి జంబుమాలితోబాటు రథమూ, గాడిదలూ నజ్జునజ్జయిపోయాయి.

రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి పైకి వచ్చారు. వారి ఆయుధాలు తగిలి హనుమంతుడాగ్రహించి తన శరీరాన్ని ఇంకా పెంచాడు. అతను ఆ ప్రాసాదంలోని ఒక స్తంభాన్ని ఒక్క ఊపున పెరికి దాన్ని గిరగిరా తిప్పేసరికి, ఆ వడికి నిప్పుపుట్టి చైత్య ప్రాసాదమంతా తగలబడిపోయింది. హనుమంతుడా స్తంభంతోనే నూరుగురు రాక్షసులనూ చంపాడు.

తరవాత అతను గట్టిగా అరుస్తూ, ''నా వంటి వానరులు అనేక వేల సంఖ్యలో సీతాదేవిని వెతకటానికి సుగ్రీవుడి చేత పంపబడ్డారు. లక్షల, కోట్ల వానరులతో సుగ్రీవుడిక్కడికి వస్తాడు. మీరు రాముడితో వైరం పెట్టుకున్నారు. ఇక లంక ఉండదు. నాశనమవుతుంది. మీరూ ఉండరు చస్తారు. రావణుడూ ఉండడు,'' అన్నాడు.

కింకరులతో బాటు జంబుమాలి కూడా చచ్చాడని విని రావణుడు ఆగ్రహావేశం చెంది, అస్త్రవేత్తలయిన ఏడుగురు మంత్రి పుత్రులను హనుమంతుడి పైకి పంపాడు. వారు తమతమ సైన్యాలను వెంటబెట్టుకుని, ఎవరు ముందు వెళ్ళి శత్రువుతో తలపడతారా అని పోటీలు పడుతూ, అమితోత్సాహంతో బయలుదేరారు. వాళ్ళు తన మీద వదిలిన బాణవర్షాన్ని తప్పించుకుని హనుమంతుడు గాలిలోనే సంచరిస్తూ, రాక్షసమూకను చేతులతోనూ, కాళ్ళతోనూ కొట్టి చంపాడు. వారు పెట్టిన చావు కేకలకు లంక యావత్తూ పిక్కటిల్లింది.

మంత్రి పుత్రులు కూడా ఎప్పుడైతే చచ్చారో, రావణుడికి భయం ఆరంభమయింది. కాని

అతను దాన్ని లోపలనే అణచుకుని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ అనే అయిదుగురు అగ్రసేనానాయకులను పిలిచి, ''సేనాధిపతులారా, మీరు చతురంగ బలాలతో వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. వాడు వానరుడుగా నాకు తోచలేదు. ఏ ఇంద్రుడో తపస్సు చేసి ఈ భూతాన్ని మన పైకి పంపాడేమో! నేను కూడా మహా బలవంతులైన వానరులను, వాలి సుగ్రీవ నీల ద్వివిదాదులను చూశాను గాని, వారి కన్న ఈ వానరుడు మిన్నగా కనబడతాడు. ఇదేదో వానర రూపంలో ఉన్న భూతం. ప్రయాసపడి ఎలాగైనా ఈ వానరుణ్ణి మీరు పట్టాలి. యుద్ధం చేసేటప్పుడేమాత్రమూ అశ్రద్ధగా ఉండకండి,'' అని హెచ్చరించాడు.

ఆ అయిదుగురూ బయలుదేరి అశోక వన ద్వారం దగ్గిరికి వెళ్ళి హనుమంతుణ్ణి చూసి, అతన్ని అన్నివైపుల నుంచీ చుట్టుముట్టి యుద్ధం ఆరంభించారు. దుర్ధరుడు హనుమంతుడి తలను అయిదు బాణాలతో కొట్టాడు. హనుమంతుడొక్క పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి ఎగిరాడు. అక్కడి నుంచి అతను అతి వేగంగా, సూటిగా దుర్ధరుడి రథం పైకి దూకే సరికి, ఆ పాటుకు రథమూ, దానికి కట్టిన ఎనిమిది గుర్రాలూ, అందులో వున్న దుర్ధరుడూ క్షణంలో నాశనమయ్యారు.

దుర్ధరుడు చచ్చేసరికి విరూపాక్ష యూపాక్షులు ఆగ్రహం చెంది ఆకాశానికి ఎగిరి, ముద్గరాలతో హనుమంతుణ్ణి రొమ్ము మీద



కొట్టారు. హనుమంతుడొక మద్దిచెట్టు పెరికి, దాంతో వారిద్దరినీ చావ మోదాడు. ముగ్గురు చావగా మిగిలిన ఇద్దరూ అడ్డకత్తీ, శూలమూ తీసుకుని హనుమంతుడిపై కలియబడి, అతణ్ణి గాయపరిచారు. హనుమంతుడొక పర్వత శిఖరాన్ని, దానిపై గల వృక్షాలతోనూ, జంతువులతోనూ సహా విరిచి, దాన్ని ఎత్తి ప్రఘసుడి పైనా, భాసకర్ణుడి పైనా కొట్టి, వారిని కూడా చంపాడు.

ఇలా అయిదుగురు యోధులనూ చంపి హనుమంతుడు వారి సేనలను అవలీలగా నిర్మూలించాడు.

ఈ వార్తకూడా తెలియరాగానే, రావణుడి కన్ను యుద్ధోద్రిక్తుడై ఉన్న తన కొడుకు అక్షుడి పైన పడింది. తండ్రి తన కేసి చూడ టమే ఆలస్యంగా అక్షుడు చివాలున లేచి, బంగారం పొదిగిన తన విల్లు తీసుకుని, బంగారు అలంకరణలు గల తన గొప్ప రథ మెక్కి హనుమంతుడి పైకి వెళ్ళాడు. ఆ రథం నిండా ఆయుధాలున్నాయి. అది యుద్ధానికి ఆయత్తం చేయబడి ఉన్న రథం. అతని వెంట సైన్యం కూడా వెళ్ళింది.

హనుమంతుడింకా అశోకవన ద్వారం వద్దనే ఉన్నాడు. అతణ్ణి చూస్తూనే అక్షుడు తన శత్రువు పరాక్రమవంతుడని గ్రహించి గౌరవభావంతో చూశాడు. ఇద్దరికీ గొప్ప యుద్ధం జరిగింది. అక్షుడు కుర్రవాడైనా అతని పరాక్రమం చూసి హనుమంతుడు కూడా సంతోషించాడు. అతను అక్షుడి బాణా లకు అందకుండా తప్పుకుంటూ గాలిలో తిరుగుతూ, "ఈ కుర్రవాణ్ణి ఎలా చంపడం? అయినా వీడిప్పుడే ఇంత ప్రతాపం చూపుతు న్నాడే, ముందుముందింకా ఎంత ప్రబలు డవుతాడో! ఇప్పుడే వీణ్ణి చంపటం మంచిది," అనుకున్నాడు.

అక్షకుమారుడి రథం ఆకాశంలో కూడా సంచరించగలది. అది ఆకాశంలో ఉండ గానే హనుమంతుడు ఆ రథానికి గల గుర్రా లను చేత్తో కొట్టి చంపి, చక్రాలు విరిచాడు. రథం నేల కూలింది, కాని అక్షుడు విల్లుతో రివ్వున ఆకాశంలోకి లేచాడు. అలా లేచిన అక్షుడి కాళ్ళు రెండూ ఉపాయంగా పట్టు కుని, హనుమంతుడు అతణ్ణి గాలిలో గిరగిరా తిప్పి, బలంగా నేల కేసి కొట్టి చంపేశాడు.





# కష్టమైనపని

చిరంజీవి అన్న జ్ఞాని దేశ సంచారం చేస్తూ చంద్రసేన మహారాజు కొలువుకు వెళ్ళాడు. ఆ సమయానికి సభలో, రాజు అడిగిన ఒక ప్రశ్న గురించి చర్చ జరుగుతున్నది. ఆ ప్రశ్న ఏమంటే, ''ఈ ప్రపంచంలో అన్నిటికన్న కష్టసాధ్యమైన పని ఏమిటి?'' అన్నది.

ఒక్కరొక్కరే లేచి తమకు తోచిన సమాధానాలు చెబుతున్నారు-స్వర్గానికి వెళ్ళడమని కొందరూ, అమృతాన్ని సాధించడమని కొందరూ, దేవుణ్ణిచూడడమని కొందరూనూ. రాజు ఇలాటి సమాధానాలకు విసుక్కుని, ''స్వర్గమూ, అమృతమూ, దేవుడూ-వీటి సంగతి మనకు తెలియదు. వాటిని మనం చూడలేదు. మనకు తెలిసి కూడా చేయలేని పని ఏమిటో ఎవరైనా చెప్పండి,'' అన్నాడు.

మళ్ళీ ఒక్కొక్కరే సమాధానాలు ఆరంభించారు-నిజం చెప్పడమనీ, ఏకపత్నీవ్రతమనీ, మహాదాత కావడమనీ తోచిన సమాధానాలు చెప్పసాగారు.

రాజుకు ఈ సమాధానాలు కూడా రుచించ లేదు. సభను ఒకసారి పరిశీలనగా చూశాడు. అప్పుడు చిరంజీవి లేచి, రాజుకు తనను తాను పరిచయం చేసుకుని, ''అన్నింటి కన్న కోరికలను జయించటం కష్టసాధ్యమని నా బుద్ధికి తోస్తున్నది,'' అన్నాడు.

రాజు తల అడ్డంగా ఆడించి, ''ఎందు చేత?'' అన్నాడు.

''హరిశ్చంద్రుడు నిజం తప్ప చెప్పలేదు. రాముడు ఏకపత్నీవ్రతం పాటించాడు. శిబీ, దధీచీ, కర్ణుడూ మహాదాతలు. కాని అవి వారి కోరికలకు అనుగుణమైనవి గనక అలా చెయ్యగలిగారు. ఈ ప్రపంచానికి మూలం కోరిక. మహాత్ములైనా, పాపాత్ములైనా కూడా కోరికకు దాసులే!'' అన్నాడు చిరంజీవి.

**25-ఏళ్ళనాటి చందమామ కథ**



రాజు చిరంజీవి వాదనను మెచ్చుకుని, అతనికి కానుకలిచ్చి సత్కరించాడు.

ఆ సభలో ఉండే దుర్జయుడు అనే వాడికి, ముక్కూ, మొహమూ తెలియని చిరంజీవిని రాజు మెచ్చుకుని సన్మానించడం నచ్చలేదు. వాడు లేచి నిలబడి, ''ప్రభూ, కోర్కెలను జయించడం కష్టం కాదు. అలా జయించిన మనిషి ఒకడు సమీపారణ్యంలో ఉన్నాడు. తమ సెలవైతే అతన్ని తీసుకు వచ్చి రుజువు చేయగలను,'' అన్నాడు.

''రుజువు చెయ్యగలిగితే మంచి బహుమానం ఉంటుంది. లేని పక్షంలో కారాగార ప్రాప్తి!'' అన్నాడు చంద్రసేనుడు.

దుర్జయుడు తనకు తెలిసిన మనిషికి ఋషి వేషం వేసి, ఎలా మసులుకోవాలో చెప్పి, రెండు రోజుల తరవాత అతన్ని కొలువుకు వెంటబెట్టుకుని వచ్చి, ''ఇతనే ప్రభూ, నేను చెప్పినమనిషి,'' అన్నాడు రాజుతో.

రాజు అతడికి కోరికలున్నదీ, లేనిదీ పరీక్షించమని చిరంజీవిని నియోగించాడు. చిరంజీవి ఆ మనిషికి ఎన్నో ఆశలు చూపించాడు, కాని ఆ దొంగఋషి దేనికీ లొంగలేదు. ఆ మనిషికి ఏ కోరికా లేనట్టు కనబడింది.

చంద్రసేనుడు చివరకు విసిగిపోయి, ''ఈ రాజ్యానికి నిన్ను రాజును చేస్తాను, ఒప్పుకుంటావా?'' అని అతన్ని అడిగాడు.

''సర్వసంగపరిత్యాగిని. నాకు రాజ్యమెందుకు?'' అన్నాడు దొంగఋషి.

చిరంజీవి ఏదో ఆలోచించి, ''మహానుభావా! మీ వంటివారు మహా అరుదు. అయినా రేపు మళ్ళీ సభకు వస్తే, మీకూ కోరికలున్నాయని రుజువు చేయగలను. రాని పక్షంలో మీకు

అక్టోబర్‌లో వస్తుందని ప్రకటించబడిన ఆర్య కామిక్స్ రెండవ భాగం 'యువరాజు ఆర్య సువర్ణద్వీప అన్వేషణ' 2009 జనవరి సంచికలో ప్రారంభమవుతుంది. తేదీ మార్పును గమనించాలని పాఠకులకు సవినయంగా మనవి చేస్తున్నాం. - ప్రచురణకర్త

కోరికలున్నట్టే భావించడం జరుగుతుంది,'' అన్నాడు.

చిరంజీవి ఉద్దేశం ఎవరికీ అర్థం కాలేదు. బహిరంగంగా అందరి ఎదటా కోరికలు లేనట్టు నటిస్తున్న ఆ ఋషి, చాటుగా తన కోరికలను బయటపెట్టుకుంటాడని చిరంజీవి అభిప్రాయం అయి ఉండవచ్చునని వాళ్ళు అనుకున్నారు. దొంగఋషి కూడా అలాగే అనుకుని, జాగ్రత్తగా మసలుకున్నాడు.

మర్నాడు దుర్జయుడు దొంగఋషిని వెంటబెట్టుకుని, కొలువుకు వచ్చాడు. చిరంజీవి ఋషిని చూస్తూనే, ''తమకు కోరిక ఉన్నట్టు రుజువు చేస్తానని చెప్పానుగదా, ఎందుకు వచ్చారు?'' అని అడిగాడు.

దొంగఋషి నవ్వి, ''ఎలా చేస్తావో చూద్దామని!'' అన్నాడు.

''అదే మీ కోరిక!'' అన్నాడు చిరంజీవి. సభ హర్షధ్వానాలతో నిండిపోయింది. సద్దుమణిగాక చిరంజీవి దొంగఋషితో, ''స్వామీ, మీకు కోరిక లేకపోవడమేమిటి? మీకు కోరిక లేదని నిరూపించుకోవడం కోసం అరణ్యం నుంచి రాజసభకు వచ్చారు, ఇంకో రోజు ఆగమంటే ఆగారు. మీకు కోరికలు లేవని నిరూపించుకోవాలన్నది మీ కోరిక కాదా?'' అన్నాడు.

చంద్రసేనుడు దుర్జయుడి కేసి చూసి, ''నువ్వు ఓడిపోయావు. నీకు కారాగారశిక్ష తప్పదు!'' అన్నాడు.

చిరంజీవి రాజు వంక చూసి, ''ప్రభూ, ఇందులో దుర్జయుడి తప్పేమీ లేదు. కోరికలను జయించడం అసాధ్యమని ఇప్పుడేగదా రుజువయింది! నేను చెప్పినది తప్పని నిరూపించాలన్న కోరికతో అతను ఇలా చేశాడు. అతన్ని మన్నించి వదిలిపెట్టవచ్చు,'' అన్నాడు.

చంద్రసేనుడు దుర్జయుణ్ణి మన్నించి, చిరంజీవిని ఇంకా ఘనంగా సన్మానించాడు.



# ఫతేపూర్ సిక్రీ



తండ్రి హుమయూన్, తాత బాబర్‌లాగే ఆగ్రా నుంచి పాలన సాగించిన అక్బర్ చక్రవర్తి ( 1556 - 1605 ) అక్కడ ఒక కోటను నిర్మించాడు. పిల్లలు లేని అక్బర్ ఆగ్రాకు నలభై కి.మీ. దూరంలో ఉన్న సలీం చిస్టీ అనే సూఫీ సన్యాసిని దర్శించి పుత్రుడు కలిగేలా ఆశీర్వదించమని వేడుకున్నాడు. కొన్నాళ్ళకు అక్బర్ సతీమణి జోధ్‌బాయి మగబిడ్డను కన్నది. బిడ్డకు సలీం (తరవాత అతడే జహాంగీరు) అని పేరు పెట్టారు. సలీంచిస్టీ మరణించాక అక్బర్ ఆయనకు ఎర్రసున్నపురాయితో అందమైన సమాధిని నిర్మించాడు.

ఉత్తరోత్తరా అక్బర్ రాజ్యవిస్తరణ జరిగింది. దక్కను ప్రాంతాన్ని జయించాడు. దానికి విజయ చిహ్నంగా ఒక నగరాన్ని నిర్మించ తలపెట్టి 1571లో సిక్రీ వద్ద కోట నిర్మాణాన్ని ప్రారంభించాడు. పూర్తయ్యాక దానికి ఫతేపూర్ సిక్రీ (విజయనగరం) అని నామకరణం చేశాడు. సలీంచిస్టీ సమాధి చుట్టూ చాలా వరకు ఎర్రసున్నపురాయిని ఉపయోగించి కోటను నిర్మించాడు. అది ఇప్పుడు తెల్ల చలువరాళ్ళతో పునర్నిర్మించబడింది.

కోట ఆవరణలో దివాన్-ఇ-ఆమ్, దివాన్-ఇ-ఖాస్, ఐదంతస్థుల పంచ్‌మహల్, ఒక్కసారిగా 10,000 మంది సమావేశం కావడానికి వీలుగా ఉన్న విశాలమైన జమామసీద్, మన దేశంలోనే ఎత్తయిన ద్వారబంధంగా భావించబడే బులాండ్ దర్వాజా ఉన్నాయి. ప్రధాన భవనంతో కలుపబడే నాలుగు వంతెనలతో ఉన్న చార్ చమన్ తటాకంతో పాటు జోధ్‌బాయికీ, బీర్బల్‌కూ నిర్మించబడ్డ భవనాలు కూడా ఉన్నాయి. సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు తన గానంతో అక్బర్ చక్రవర్తికి వీనుల విందుచేసిన వేదిక ఇక్కడే ఉన్నది.

అక్బర్ చక్రవర్తి భవన నిర్మాణ విధానానికి ముఖ్యమైన వారసత్వంగా ఫతేపూర్ సిక్రీని చెబుతారు. ఈ కోట నిర్మాణంలో ముస్లిం, హిందు, జైన, బౌద్ధ శిల్పకళా ప్రభావాలు కలగలిసి ఉన్నాయి. విలక్షణమైన ఈ సమ్మేళనమే 1983లో ఫతేపూర్ సిక్రీ యునెస్కో ప్రపంచ వారసత్వ స్థలంగా గుర్తించడానికి కారణమయింది.




# అసలైన అందం

పరమేశ్వరశాస్త్రి గురుకులంలో విద్యాభ్యాసం చేస్తూన్న మనోహరుడు పేరుకు మనోహరుడే గాని, చూడడానికి అనాకారిగా ఉండేవాడు. సహ విద్యార్థులు వాణ్ణి 'పొట్టివాడని' 'నల్లవాడని' ఎగతాళి చేసేవారు. గురువుకు చెబితే ఆయన, ''నువ్వు వాళ్ళ మాటలను పట్టించు కోవద్దు. చదువు మీద ధ్యాస నిలుపు,'' అని హితవు చెప్పేవాడు.

మనోహరుడికి తనను హేళన చేసే తోటి విద్యార్థులను మందలించకపోగా, తనకే బుద్ధి చెబుతూన్న గురువు మీద కోపం వచ్చేది. మౌనంగా బాధపడేవాడు. క్రమంగా ఆత్మన్యూనతా భావం ఏర్పడడంతో సక్రమంగా చదవలేకపోయాడు. తనను మాత్రం దేవుడు ఎందుకిలా అనాకారిగా పుట్టించాడు అని ఆలోచిస్తూ, పరధ్యానంతో గడిపేవాడు. పర్యవసానంగా చదువులో వెనకబడడమే కాదు; చిన్న చిన్న పనులు కూడా సక్రమంగా చేయలేకపోయాడు.

ఒకనాడు గురువు భార్య ఉట్టి మీది నెయ్యి కుండ దింపమని చెప్పింది. మనోహరుడు పరధ్యానంతో సరిగ్గా పట్టుకోక పోవడంతో చెయ్యి జారింది. కుండ పగిలి నెయ్యి నేల పాలయింది.

గురువు భార్య పట్టరాని కోపంతో, ''నీది మట్టి బుర్ర. నెయ్యి కుండను జాగ్రత్తగా దించలేనివాడివి నువ్వేం చదువుతావు. గొడ్లుకాయడానికి కూడా పనికిరావు,'' అంటూ తిట్టింది.

దాంతో మనోహరుడి పసిమనసు గాయపడింది. ఎవరికీ చెప్పాపెట్టకుండా గురుకులం వదిలిపెట్టాడు. ఎటు వెళ్ళాలో కూడా తెలియక నడిచి నడిచి మిట్టమధ్యాహ్నానికి ఒక గ్రామం పొలిమేరలో ఉన్న మామిడి తోటను సమీపించాడు. అక్కడి బావినుంచి నీళ్ళు

వాణిశ్రీ



కొన్నాళ్ళు చెప్పిన పనులు చేస్తూ తోటకు జాగ్రత్తగా కాపలా కాశాడు. పిందెలు కాయల య్యాయి. అయితే, ఈలోగా మనోహరుడిలో చేస్తూన్న పనిపట్ల చులకనభావం ఏర్పడింది. తన ఈడు పిల్లల్లా హాయిగా చదువుకుని ఏ రాజుగారి కొలువులోనో గొప్ప ఉద్యోగం చెయ్యవలసిన తనకు ఈగతి పట్టిందేమిటా అని కుమిలిపోసాగాడు. అందువల్ల చేసే పని మీద శ్రద్ధ తగ్గింది. దానిని గమనించిన తోటయజమాని, ''ఏరా పొట్టివెధవా! మూడు పూటలా పీకల వరకు మెక్కుతున్నావు. పనిలో అంత అలసత్వమేమిటి? ఒళ్ళు దగ్గర పెట్టుకుని పనిచెయ్,'' అని హెచ్చరించ సాగాడు.

తోడుకుని తాగి, ఒక చెట్టు కింద చతికిలబడి, బాగా అలిసిపోయి ఉండడంతో కొంత సేపటికి అలాగే నిద్రపోయాడు.

పొద్దు వాలుతూండగా అక్కడికి వచ్చిన ఒక మధ్యవయస్కుడు మనోహరుణ్ణి తట్టి లేపి, ''ఎవరు నువ్వు? వేళగాని వేళ ఇక్కడ నిద్రపోతున్నావేమిటి?'' అని అడిగాడు.

మనోహరుడు, ''దిక్కులేనివాణ్ణి. ఏదైనా పని దొరుకుతుందేమో అని దూరప్రాంతం నుంచి వస్తున్నాను,'' అన్నాడు.

''ఈ తోట నాదే. నీకు ఇష్టమైతే తోటకు కాపలా ఉండు. మూడు పూటలా తిండి పెడతాను. చెట్టు పూతా పిందెగా ఉంది. పంట చేతికి వచ్చాక కొంత డబ్బు కూడా ఇస్తాను,'' అన్నాడు ఆ తోట యజమాని అయినవీరయ్య. మనోహరుడు సరేనని తోటమాలిగా చేరాడు.

ఇలా ఉండగా ఒకనాడు పట్టపగలే మనోహరుడు చెట్టు కిందకునుకు తీస్తూం డగా, తోటలో దొంగలు జొరబడి పక్వానికి వచ్చిన కాయలను కోసుకుపోయారు. సంగతి తెలిసిన తోటయజమాని, ''సంవత్సరమంతా పడిన శ్రమను దొంగలపాలు చేశావే! నువ్వెం దుకూ పనికిరావు,'' అని కేకలు పెడుతూ, పట్టరాని కోపంతో మనోహరుణ్ణి చితకగొట్టి అక్కణ్ణించి తరిమేశాడు.

మనోహరుడు విచారంతో ఎక్కడెక్కడో తిరిగి, ఆఖరికి సిరిపురం అనే చిన్న పట్టణం చేరాడు. ఏం చెయ్యాలో తెలియక వీధులన్నీ తిరుగుతూ శోషవచ్చి ఒక ఇంటి ముందు పడిపోయాడు. ఆ ఇంటియజమాని బ్రహ్మయ్య అనే ఒకస్వర్ణకారుడు. పట్టణంలోని ప్రముఖు లకు నగలు చేసి ఇస్తూంటాడు. ఆయన

మనోహరుడి ముఖం మీద నీల్లు చల్లి, స్పృహ తెప్పించాడు. అన్నం పెట్టి ఆకలి తీర్చి, అతడి పరిస్థితికి జాలిపడి, ''నాకు పనుల్లో సాయ పడ్డావంటే, నగలు చేసే పని నేర్పుతాను. నీ జీవితం హాయిగా గడిచి పోతుంది. దిగులు పడకు,'' అని ఓదార్చాడు.

ఇది బాగానే ఉందనుకుని ఆయన దగ్గర చేరిన మనోహరుడికి కొన్నాళ్ళకు ఆ పని కూడా విసుగనిపించింది. రోజూ బ్రహ్మయ్య కొరముట్లను శుభ్రం చేసి సిద్ధం చెయ్యడం, కుంపటిలో బొగ్గులు వేసి నిప్పురాజెయ్యడం తప్ప నగలు నేర్చుకునే అవకాశం రాలేదు. ఆ మాటే యజమానితో అంటే, ''బొట్టు పుల్లలు, పోగులు చేయడమే చేతకాలేదు. అప్పుడే నగలేం చేస్తావు? మొదట చెప్పిన పనులు చెయ్,'' అని మందలించేవాడు.

దాంతో మనోహరుడు ఆ పని మీద కూడా శ్రద్ధ కోల్పోయాడు. ఏకాగ్రత నశించింది. దానిని గమనించిన బ్రహ్మయ్య, ''నీకు రూపం మాత్రమే కాదు; మనసు కూడా అవకరంగా ఉంది. ఈ పని నేర్చుకోవడం నీవల్ల కాదు. దీనికి చాలా ఓర్పు అవసరం. మరో పనేదైనా చూసుకో,'' అని చెప్పి మనోహరుణ్ణి అక్కణ్ణించి సాగనంపాడు.

మనోహరుడు తన దుస్థితికి విచారిస్తూ ఊరిచివర వున్న వేణుగోపాల స్వామి ఆలయానికి వెళ్ళి మనసులోనే దేవుడితో మొరపెట్టుకున్నాడు. పూజారి పెట్టిన ప్రసాదం కూడా తినకుండా, దాపులనున్న ఏటి గట్టుకేసి నడిచాడు. అక్కడ ఆవుదూడ నోటికి లేత గడ్డి అందిస్తూ ఒకసాధువు కనిపించగానే ఆయన్ను సమీపించాడు.



''ఏం, నాయనా, మిన్ను విరిగి మీదపడ్డట్టు పుట్టెడు దిగులుతో ఉన్నావు? నీకొచ్చిన కష్ట మేమిటి?'' అని అడిగాడు సాధువు ఎంతో ఆప్యాయంగా.

మనోహరుడు తన బాధలను ఏకరువు పెట్టి, ''దేవుడు నన్నెందుకు పొట్టిగా, నల్లగా పుట్టించాడు? అనాకారినని తోటివాళ్ళు హేళన చేస్తూంటే సరిగ్గా చదవలేకపోయాను. ఏ పనీ ఏకాగ్రతతో చేయలేకపోతున్నాను. బతుకు దుర్భరమైపోయింది. మీరే నాకు దారిచూపాలి,'' అన్నాడు కన్నీళ్ళతో.

''నాయనా, నువ్వు అనాకారివని ఎవర న్నారు? నిన్నలా అవమానించే వాళ్ళే మానసి కంగా అనాకారులు. ఇంతకూ నీకేం తక్కువని? ప్రపంచంలో కాళ్ళుచేతులు లేని అవిటి వాళ్ళు, చూపులేని అంధులు కూడా ఏదో ఒక విద్యనేర్చుకుని సుఖంగా బతుకుతున్నారు. భగవంతుడు నీకు అన్నీ ప్రసాదించాడు. నువ్వే ఇతరులతో పోల్చుకుని నిన్ను నువ్వు కించ పరుచుకుని బాధలను కొని తెచ్చుకుం టున్నావు. సృష్టిలో ఏ జంతువూ మరో జంతు వుతో పోల్చుకుని బాధ పడదు. నీలాంటి మనుషుల్లో మాత్రమే ఆ లక్షణం కనిపి స్తుంది. అనర్థాలన్నిటికీ అదే కారణం. చక్కగా చదువుకుని, నీకున్న శక్తుల్ని పెంపొందించు కుని సుఖంగా జీవించు. మొదట గురు కులానికి తిరిగి వెళ్ళి ఏకాగ్రతతో విద్యన భ్యసించు. సకల సిరులూ నిన్ను వెతుక్కుం టూవస్తాయి,'' అని చెప్పి ఆశీర్వదించాడు సాధువు.

మనోహరుడు సాధువుకు నమస్కరించి, కళ్ళు తుడుచుకుని గురుకులం కేసి నడి చాడు. గురువుకు క్షమాపణలు చెప్పి గురు కులంలో చేరి పట్టుదలతో విద్యనభ్యసించ సాగాడు.

విద్యాభ్యాసం ముగించి, ప్రయోజకుడై గొప్ప ఉద్యోగం చేస్తూ అందరి మెప్పునూ పొందినప్పుడు, ఎవరూ తన అనాకారితనం గురించి ప్రస్తావించకపోవడం గమనించి మనోహ రుడు సంతోషించాడు. మనిషికి అన్నిటికన్నా మించిన అందం, సంపద విద్య అని తెలియ జేసిన సిరిపురం వేణుగోపాలస్వామి గుడి దగ్గరి సాధువుకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.



# చందమామ క్విజ్ - 9

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

**అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.***

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

ఈ నెల ప్రశ్నలు భారతీయ కళలు, శిల్పాలకు సంబంధించినవి

<u>మీరు చేయవలసిందేమంటే</u> : 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ క్విజ్- **9** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. అక్టోబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. డిసెంబర్ 2008 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.



1. ఇతర దేశాల రాజ్యాంగ శాసనాల నుంచి మన రాజ్యాంగం కొన్ని అంశాలను స్వీకరించింది. రాష్ట్రపతి ఎన్నిక విధానాన్ని ఏ దేశం నుంచి గ్రహించిందో చెప్పగలరా?
2. పార్లమెంటరీ విధాన ప్రభుత్వాన్ని ఏ దేశం నుంచి తీసుకున్నాం?
3. భారత రాజ్యాంగ స్వభావం ఏమిటి?
4. రాష్ట్రపతిగా ఎన్నిక కావడానికి కనిష్ఠ వయోపరిమితి ఎంత?
5. భారత రాజ్యాంగానికీ, బ్రిటన్ రాజ్యాంగానికీ మధ్య ఉన్న భేదం ఏమిటి?
6. వేరొక దేశ పౌరుడు భారతదేశ రాష్ట్రపతి కాగలడా?
7. రాజ్యసభలో 'మనీ బిల్' ప్రవేశపెట్టడానికి సాధ్యపడుతుందా?
8. భారతదేశ జాతీయగీతంగా 'జనగణమన' ఎప్పుడు గుర్తించబడింది?

# వార్తలలో బాలలు

## జాతీయ ఛాంపియన్




గత జూన్ నెలలో చెన్నయ్‌లో జరిగిన మార్స్ ఇంటర్నేషనల్ స్పెల్లింగ్ బీ కంటెస్ట్ కేటగిరి 2 (3,4 తరగతులు)లో ఎనిమిదేళ్ళ నిర్మల్ పళని యప్పన్ నేషనల్ ఛాంపియన్‌షిప్ వరసగా రెండవసారి గెలుపొందాడు. నిర్మల్ ఇప్పుడు ఒరిస్సా భువనేశ్వర్ లోని కేంద్రీయ విద్యాలయలో నాలగవ తరగతి చదువుతున్నాడు. గత సం. మూడవ తరగతి చదువుతున్నప్పుడు గోవాలో జరిగిన పోటీలో పాల్గొని ఒకటవ కేటగిరీలో ఛాంపియన్‌షిప్ సాధించాడు. పాఠశాల, జిల్లా, రాష్ట్రస్థాయి పోటీల్లో ప్రథముడుగా రావడంతో నిర్మల్ ఇప్పుడు ముంబయిలో జరుగనున్న ఇంటర్నేషనల్ కంటెస్ట్‌లో పాల్గొనను న్నాడు. ఈ పోటీలో పాల్గొనాలంటే కనీసం 4,000 ఇంగ్లీషు పదాలకు స్పెల్లింగులూ, అర్థాలూ తెలిసి ఉండాలి. ముంబయి సమీపం పోవాయ్‌లో చదువుకుంటున్నప్పుడు తన గణిత జ్ఞానాన్ని మెరుగు పరుచుకుకోవడానికి 'సిప్' అకాడెమీలో చేరాడు. ముంబయిలో జరిగిన సిప్ ప్రాడిజీ 2007 కాంపిటీషన్‌లో ఐదు నిమిషాల్లో 100 లెక్కలు చేసి రెండవ రన్నర్ అప్‌గా వచ్చాడు.

## చదరంగం బాలమేధావి

మనదేశంలో చదరంగం బాలమేధావులకు కొరత లేదు.కాని, ఏడేళ్ళ ప్రాయంలో ప్రపంచస్థాయి మూడు చదరంగ పోటీలలో విజయం సాధించడం అన్నది చాలా విలక్షణమైన సాధన. మనదేశంలో ఈనాటి చెస్‌లో విజ్-కిడ్‌గా పేరు తెచ్చుకుంటూన్న అమ్మాయి ముత్యాల బన్నీప్రతిమ. ఆంధ్రరాష్ట్రానికి చెందిన ఈ అమ్మాయి రెండేళ్ళ క్రితమే చెస్ ఆడడం మొదలు పెట్టింది. గత సంవత్సరం ఆరేళ్ళలోపు, తొమ్మిదేళ్ళలోపు విభాగాలలో ప్రథమ స్థానం సాధించింది. దాంతో ఆ పాపాయికి టర్కీ అంటల్యాలో జరిగిన వరల్డ్ యూత్ చెస్ ఛాంపియన్‌షిప్‌లో పాలుపంచుకునే అవకాశం లభించింది. అక్కడ బాలికల విభాగంలో ప్రపంచ బెస్ట్ ట్యాలెంట్ (2007)గా గుర్తింపు పొందింది. ఈ సంవత్సరం శ్రీలంక కాండీలో జరిగిన ఏషియన్ స్కూల్స్ చెస్ ఛాంపియన్‌షిప్‌లో ఎమిమిది రౌండ్లు గెలిచింది. సింగపూర్‌లో జరిగిన వరల్డ్ స్కూల్స్ చెస్ ఛాంపి యన్‌షిప్ ఏడేళ్ళలోపు కేటగిరిలో తొమ్మిది రౌండ్లు గెలుపొంది ప్రతిమ బంగారు పతకం సాధిం చింది.



# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## మన పరిసరాలు




### సాధారణమైన జలుబు అసాధారణమైన నిజాలు

ఒళ్ళంతా నొప్పులు... ముక్కులు మూసుకుపోవడం... ధారాపాతంగా కారడం... ఎడతెరపిలేని తుమ్ములు... ఇవీ జలుబు తీసుకువచ్చే బాధలు. ఇది చాలా సాధారణమైన జలుబు అని డాక్టర్లు చెబుతున్నప్పటికీ దీన్ని వెంటనే నయం చేయడం అన్నది సాధ్యం కాని పని. ఎందుకంటే ఇరవై రకాల వైరస్సులు అంటే సూక్ష్మ విషక్రిములు జలుబును కలిగిస్తాయని పరిశోధనలు తెలియజేస్తున్నవి.

జలుబును రాకుండా నిరోధించేందుకు టీకాలు లేవు–జలుబు నుంచి ఉపశమనం కలిగించడానికి ఇచ్చే చాలా మందులు 'యాంటిస్టామిన్స్'. ఇవి హాని కలిగించే వైరస్ శరీరం అలెర్జిక్ రియాక్షన్‌ను తగ్గిస్తాయి.

## విజ్ఞాన వీచికలు :



### జెరాక్స్ ఎలా పనిచేస్తుంది?

జెరాక్స్ లేదా ఫోటో కాపియర్ నిశ్చలన విద్యుత్ సిద్ధాంతాల ఆధారంగా పనిచేస్తుంది. ఒక ఆకారాన్ని మార్పిడి చేసి ప్రతిని తీస్తుంది. ఒక పత్రం ప్రతిని తీయాలంటే మొదట దాన్ని జెరాక్స్ మెషీన్ లోపల అమర్చాలి. ఆ విధంగా చేయాలంటే పై పలకను పైకెత్తి పత్రాన్ని శుభ్రమైన అద్దం పలక మీద బోర్లా ఉంచాలి. బల్బ్ స్విచ్ ఆన్ చేయగానే బల్బు నుంచి వెలుగు పత్రం మీద పడి లెన్స్ ద్వారా ప్రతిబింబించి రొటేటింగ్ డ్రమ్ మీద వెనక్కు పడుతుంది.

ఆకారంతో గల డ్రమ్ తిరిగేప్పుడు, దాని మీద నెగటివ్‌గా చార్జయిన 'టోనర్' అనే నల్లటి గ్రాఫైట్ పొడి పూయబడుతుంది. ఈ గ్రాఫైట్ పొడి మీద అతుక్కుపోవడానికి వీలుగా ప్లాస్టిక్ పూయబడి ఉంటుంది. పూయబడిన డ్రమ్ కాగితం మీద దొర్లినప్పుడు, ఆకారం దాని మీదికి మార్చబడుతుంది. ఆకారం కాగితానికి చక్కగా అంటుకు పోయేలా ప్లాస్టిక్ కరిగి అతుక్కుపోవడానికి వీలుగా వేడి రోలర్ల మీదుగా పంపబడుతుంది. ఆకారం సరిగ్గా అతుక్కోని ఫోటో కాపీలను తాకినప్పుడు వేళ్ళకు నల్లటి మరకలు అంటుకుపోతాయి.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని
వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



K.S. SIVARKKAMANI



TATA NARAYANAMURTHY



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా
మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు డిసెంబర్ 2008 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, జెవిఎల్ ప్లాజా 6వ అంతస్తు, 626, అన్నాసాలై,
తేనాంపేట, చెన్నయ్ - 600 018

## అభినందనలు

ఆగస్ట్ నెల పోటీ ఫలితాలు
డి. సుజన్ తథాగత
కేరాఫ్ డి. నటరాజ్
9-31-6/25 F2
పిఠాపురం కాలనీ
విశాఖపట్నం-530 003
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో: ఆడడానికి ముందు!
రెండవ ఫోటో : చెయ్యాలి కమ్మని విందు!!

## సమాధానాలు :

1. రావణుడు, కుంభకర్ణుడు, మేఘనాథుడు 2. కుంభమేళా; హరిద్వారం, ఉజ్జయిని, ప్రయాగ, నాశిక్ 3. ప్రహ్లాదుడు - హోళిక; ప్రహ్లాదుడి తండ్రి హిరణ్యకశిపుడి సోదరి 4. గురుగోవింద్‌సింగ్ 1699లో ఖల్సాను స్థాపించిన రోజు 5. గణేశుడు (గణేశ చతుర్థి) దుర్గ (దుర్గాపూజ).

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. Editor : B. Viswanatha Reddi (Viswam)



# ప్రభుత్వ బస్సుల్లో వెళ్ళడం వల్ల ఉపయోగాలు

నాన్నతో కూర్చుని శంకర్ న్యూస్ చూస్తున్నాడు. ''మళ్ళీ పెట్రోల్-డీజల్ ధరలు పెరిగాయి. రేపట్నుంచి కారును వదిలి ఆఫీసుకు నడిచి వెళ్ళాల్సిన పరిస్థితి ఏర్పడేలా ఉంది,'' అన్నాడు శంకర్ తండ్రి.

శంకర్ చిన్నగా నవ్వి, ''ఇందులో పెద్ద ఆశ్చర్య మేముంది! అవసరాలకు సరిపడా సరఫరా లేనప్పుడు ధరలు పెరుగు తాయని మా ఎకనమిక్స్ క్లాసులో నేర్చుకున్నాం కదా!'' అన్నాడు.

''ఇంకా ఏమేం నేర్చుకున్నావేంటి అమార్త్యాసేన్?'' అంటూ నవ్వాడు తండ్రి.

''అది సరే, నాన్నా. మనింటి నుంచి మీ ఆఫీసు వరకు డైరెక్టు బస్సు ఉంది కదా. మరి రోజూ కార్లోనే వెళతా వెందుకు? రేపట్నుంచి బస్సులో వెళితే ఎంత ఇంధనం, తద్వారా డబ్బు ఆదా అవుతుందో ఆలోచించి చూడు,'' అన్నాడు శంకర్.

''డబ్బు ఆదా అవుతుంది. నిజమే, మరి బస్సు ఊరంతా చుట్టుకుని వెళుతుంది. ట్రాఫిక్‌తో ఆఫీసు చేరే సరికి ఆలస్యమై పోతుంది కదా?''

''ప్రైవేటు వాహనాలవల్లే కదా వాహనాల రద్దీ పెరిగి పోయింది? ఒక్క ఢిల్లీలో ట్రాఫిక్ సిగ్నల్స్ వద్ద కాచుకుని ఉండడం వల్లే 994 కోట్ల రూపాయలు విలువచేసే ఇంధనం వృథా అవుతోందన్న విషయం మీకు తెలుసా? ఢిల్లీ పిసిఆర్ఎ, సిఆర్ఆర్ఐ జరిపిన అధ్యయనాల్లో ఈ విషయం బయట పడింది! మిగతా నగరాల పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోండి!'' అన్నాడు శంకర్.

''మీ తాతయ్య ప్రభుత్వ వాహనాల్లోనే వెళ్ళేవాడు. నేను చిన్నప్పుడు బస్సులోనే పయనం చేసేవాణ్ణి. సొంత కారు కొనాలని కలలు కనేవాణ్ణి,'' అన్నాడు తండ్రి.

''కార్లో వెళ్ళడం హుందాగానే ఉంటుంది. అయితే, అవసరానికి మించి ఇంధనాన్ని అందుకు వృథా చేస్తున్నాం కదా. ఇంటి నుంచి మామూలు కన్నా కాస్త ముందు బయలుదేరి బస్సులో వెళితే బోలెడంత ఇంధనం ఆదా కదా?'' అని అడిగాడు శంకర్. ''నిజమే శంకర్. రేపట్నుంచి నేను బస్సులోనే వెళతాను. నేను మాత్రమే కాదు. నా సహోద్యోగుల్ని కూడా అలాగే చెయ్యమంటాను,'' అన్నాడు తండ్రి.

మీరు కూడా మీ స్నేహితులతో, కుటుంబ సభ్యులతో ఇంధనం పొదుపును గురించి చర్చించి ఈ సంగతి చెప్పండి. ప్రభుత్వ వాహనాలు అందుబాటులో లేని మారుమూల స్థలాలలకు వెళ్ళిరావ డానికి ట్రాన్స్‌పోర్ట్-పూలింగ్ సిస్టమ్స్‌ను ఉపయోగించుకోవచ్చు.

CHANDAMAMA (Telugu) October 2008 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08





# బబ్బా సాహసాలు




























